# సప్తగిరులు

(భక్తిగేయ సంపుటి)






కొటికలపూడి కూర్మనాథం

# సప్త గిరులు

(భక్తి గేయ సంపుటి)





కొటికలపూడి కూర్మనాధం

మూల్యము - రూ. 8-50.



ప్రతులు దొరకు చోటు.

కె. కూర్మనాథం, యం ఎ., బి. యస్‌సి., బి. ఇడి.
లెక్చరర్
మహారాజ కళాశాల
విజయనగరం-2

# శ్రీ ప్రత్యభిజ్ఞ

భావుకులు శ్రీ శివశంకరుల సూచనము శ్రీ కూర్మనాథకాంక్ష శ్రీ సప్తగిరి సత్కృతి శ్రీ కృతిభావనా రక్తి అవిశ్వాస్య మగు నా శక్తవిశ్వాసము ఈ నా ప్రత్యభిజ్ఞాహేతువు. నేను విజయనగర మహారాజ సంస్కృత కళాశాలా విద్యార్థిగా నున్నపుడు నన్ను చూచిన వారు "నవకవి" యనిరి. నేను నవుడనే గాని కవిని గానని నేనె యనిన నందరు నమ్మలేరు. "కవి కానపుడు నవుడగుటేమి ?" అని కొందరె యందురు కాగా నేను సనాతనుడను నాటికి నేటికి నేనాటికి నందరు నట్టివారె. కవితయు నట్టిది. కూర్మనాథ కృతియు నట్టిది. జ్ఞానవిజ్ఞాన శృంఖల యవిచ్ఛిన్నముగా లోకమున నుండ తగును. గ్రంథభద్రాయిత మయిన చిరంతనుల సంవిత్తి జ్ఞానాత్మకము. తదనుభూతి పరిస్పందము విజ్ఞానము. ఈ ద్వయసామరస్యము ప్రాతిభ సంపత్తి కలవారలకు అద్వయానుభూతి నావిష్కరింప జేయును. ఈ సప్తగిరి కృతి యట్టి యావిష్కృతి. కేవల ప్రతిభ యొక విధమగు ఉన్మాదము. ప్రతిభాదరిద్రత దరిద్రకవితకు నిదానము. కవితకు వలయునవి కూర్మనాథ కృతికి గలవు. గిరి సప్తకము సచేతశ్చేతోదర్పణమున ప్రతిబింబింపగలదు. సప్తగిరి సంక్రమమున సాధకుడు సప్త చక్రవర్తి యగును. కొందరిని యిట్లు భావింపగలరు.

ఆంధ్రముఖులు ఆంగ్లముఖులైన నాటినుండి తెలుగున కొక వెలుగని ఆంధ్రముఖమును ఆంగ్లముఖముగ చేసిరి. అట్టి చేతయు ఆంగ్లభాష నభ్యసించిన నాటినుండి రాలేదు. భావదాస్యము పట్టినపుడు జాతికి పురుగు పట్టగా అన్నియు నశించిపోయినవి భావదాస్యము పోవలెనని భావోద్ధారకులు భావించిరి. ఇట్టి దైశిక మయిన ఉద్యోగములో జేరదలచిన వారలకు ఆంగ్ల సారస్వతము సహకరించినది అప్పటినుండి ఆంధ్ర సారస్వతములో ఆంగ్ల సారస్వతచ్ఛాయలు నీడలు పట్టినవి. అదియొక వటవృక్షచ్ఛాయ. అంత చేరిన వే మగును.? ఆ నీడలో పెరిగిన సారస్వతము నవసారస్వత మయినది. ఆంగ్లభావుకులు ఆ భాషారమ్యతనే భావించినందున అట్టి రమ్యత తెలుగులో లేదని భావించి రమ్యత నాపాదించుచున్నామని ఒక

విధమయిన ఇంగ్లీషు తెలుగు సారస్వతమును ప్రవేశపెట్టిరి. ఆ భాషా భావములకు అందలి లాక్షణిక భాష గుణము కావచ్చును తెలుగు వెలుగులో అది గౌణ మయినది. సంస్కృత భాషాప్రభావిత మయిన దేశభాషలో వైదేశిక భాషా సంకాంతి సంకాంత్రము కాలేదు. అది యొక క్రొత్త లాక్షణిక భాష అయినది. తెలుగులో లాక్షణిక భాష లేదని నేనందునా? ఇందలి లాక్షణిక భాషలో వ్యంగ్యస్ఫురణ ముండును. అవ్యుత్పత్తివలన, అశక్తివలన లాక్షణిక భాష సంక్రమించవలెదు అంగభాషా సమయానురోధమున నవ సారస్వతములో నవభాష వచ్చినది అని సహభావులు భావించిరి. కాని యిది పురాపి నవమైన భాషగా తోచలేదు కూర్మనాథ భాషలో అట్టి వెలితి గోచరించదు.

ఆంధ్రసారస్వతములో నవోద్యమమువచ్చిన నాటినుండి డెబ్బదిరెండు వాదములకు పైగా నవీన సారస్వతవాదములు వచ్చినవి. అవి అన్నియు చిత్రవాదములు, విచిత్రవాదములు నయినవి సారస్వతమున విచిత్రత వచ్చినది. వానిలో నవి నీవు నీవని అనుకొనగలవు. ఒకటొకటి అట్లు మారి మారి వేరు వేరు వేసము వేసికొనినది. అట్టి ఇజము లెన్నియో వచ్చినవి. ఇజములు నిజమును చూపినవిగావు. ఇజములలో నిజభావ బలమును కూర్చుటకు చేర్చుటకు ఇజములను కాదనుటకు యత్నించినది. అదియొక ప్రతిక్రియాదృష్టి. ప్రతిక్రియాదృష్టితో వచ్చిన కవితలో వాదవివాదములు వెలయునే కాని అనువాది, సంవాది, విశేషములు కూడుకొనవు. కూర్మనాథ భాష అప్రతిక్రియాదృష్టికలదై, ప్రయోగవాదదృష్టితో కవితాకృతి వహించినది. నవభారతములో నిట్టి ప్రయోగవాద కవితయు నున్నది. నవకాల కవితా రీతులలో నొకటి యగునా? ఈ నాడొక హిప్పీయిజము వచ్చుచు వచ్చుచు భజనలు చేయుచున్నది. హిప్పీయిజ మిష్టపడివారు హిప్పీయిష్టులు వారి నామభజనము వారి రూపభజన మదృశ్యతమ్యము. దానికింకను కావ్యాకృతి రాలేదు వచ్చినచో నిట్టిదగునా? అని నేను భావింతునా?

శ్రీమాన్ కొటికలపూడి కూర్మనాథ కవి ప్రాంతీయ భావ వివశుడుకాడు. కాని కొంతగా తదావేశము కలవాడు. అనావిష్టుడై నటింపవలెనని, రచింపవలెనని నేనందును గాని యిందలి ఈ కూర్మనాథావేశము పాఠకుల కావేశము

నీయదు. ఆదేశము నిచ్చును. శ్రీ తిమ్మక్కానాథుడు అన్నమాచార్యుడు ఆవిష్టుడా ? అనావిష్టుడా ? ఏమయినను గీత పదములలో కూర్మనాథునకు సప్తగిరినాథ పదములను చూపి ఆదేశమిచ్చెను. ఈ సప్తగిరి వచ్చినది. శతాధికగీతసంపుటి సంకలనమున నున్న ఈ కృతి సప్తగిరి. సప్త సంఖ్యాకగిరివిశేషముల నుద్దేశించి రచితమయిన కావ్య మయినందు వలన నిది సప్తగిరి కృతి కాదగును. ఒక కృతి సప్తగిరులు అను బహు వచన విశేషిత మయినదేమి ? సప్తగిరి పదము చాలును. కాని సప్తగిరు లనుట లోకప్రీతికి, బోధప్రబోధమునకు కావచ్చునని కొందరనుకొనుట యుక్తము.

కొంతకాలముగ లోకములో శ్రీ శ్రీనివాస సుప్రభాతస్తుతి కొందరకొక ఆత్మబోధనిచ్చినది. కూర్మనాథున కట్టిబోధన మున్నది. అందుననే సప్తగిరిలోని కొంతభాగము సుప్రభాతముగ కృతిజాతమయినది. ఈ కవికి లోకగీతాసక్తి యున్నది. ఆంగ్లేయులు లిరిక్కుల నభిమానింతురు. లిరిక్కులు ఒక విధముగా గేయబద్ధములని, లోకగీతము లట్టివని నవభావులు భావించిరి స్వరశ్రుతుల ప్రస్తారములో లోకగీతముల కెన్నిటికేని యాప నిచ్చు విశేషమున్నది. ఆ విశేషములను కొటికలపూడి కవి ఆత్మవేదనముతో గుర్తించి భావవేగము స్ఫురింపచేయుటకై సప్తగిరి గాన మొనరించెను. ఈతడు గీత కవితాసవితయె కాదు. గాతయునగును. స్వరసంధాతయు నగును. శ్రుతి స్వరదాంపత్య విధాతయు నగును. సకలమునకును కలకల నాదము కల "శ్రీ సప్తగిరి" సాక్షి. ఇష్టమభీష్టము లోకమున సంద్రష్టము కాలేదని తమకు తామై అదృష్టము పండించుకొనదలచి పలాయనవాదమును కవిత పిల్లకు నేర్పి పరిగెత్తించిరి కవులు భావుకులు, వారి ఉక్తి విరుక్తము సర్వము పలాయన సూక్త మగునా ? పలాయన సూక్తము పలికినవారు మారి మారి వీరగుదురు. వీరు మారినను వారు కారు కూర్మనాథుడు పలాయనవాద మనుసరించువాడు కాదు. కవి యగువాడు ప్రతినిధిగా నుండవలయును. వాడు ఆత్మనిధి కావలసియున్నది. ఈ శ్రీమాన్ ఆత్మనిధి సర్వనవలోక ప్రతినిధి. ఆనాటి కాలమున రెండు పదములతో ఐహికము పారమార్థికము కలుపదలచిన సోమనాథునకు

భావవేగ మున్నది. సోమనాథపద భావవేగమును అందుకొనుట శక్యము కాదు కూర్మనాథుడు సోమనాథుని భావవేగమును భావించెను.

ఈ భూవాసులకు శ్రీనివాసుడు శరణము కావలసి యున్నాడు. రసా తలమునుండి రాక్షసభావావేశములు భూవాసుల మానసములలో గూడుకొను చున్నవి భూవాసులు కృత్యాప్రేరితులైనట్లు కృత్యా ప్రయోగలాలసులు కాగా ఆ లోకవాసులు కించిత్ప్రసారముననే భూవాసులకు అవాసము లేకుండ చేయునట్లున్నారు. అటు ఇటు దేశమునకు అనర్థ మాసన్నమగు చున్నది. మన మే మనవలయును ? "శ్రీనివాసశ్శరణం మమ" అనవల యును. మన ప్రతినిధిగ కూర్మనాథకవి సర్వాంశపరిశీలనమున సప్తగిరి రచించెనని కతిపయ పాఠకులేని భావింతురా ? సప్తగిరి స్వభావ సౌందర్యము "గిరుల గొప్ప"లో కవి కీర్తించెను

"ఏడు రంగులు కలసి తెల్ల నౌ నంట
ఏడు కొండల పైన నీ వెలుగు లంట
ఆరు అరులను గెలిచితే మోక్ష మంట
ఆరు గిరులను దాటితే నీ వ వంట"

ఇట్లు భావించు కవి ఏమి భావింపడు ? ఈ సప్తగిరిలో శ్రీశైలాద్రి, శేషాద్రి, గరుడాద్రి, వృషాద్రి వృషభాద్రి, నారాయణాద్రి వేంకటాద్రి రూపధేయము కలవైనవి. కాననే ఈ కృతి సప్తగిరి నామధేయము కలదైనది "తెలతెల్ల వారింది తిరుమలేశా !" అని యారంభించిన కవి "భక్తకోటి కిదె శుభం ! శుభం !" అను తుదివచనముతో శుభాశంసన మొనరించుచున్నాడు. "దేవా లేవయ్య", "మేల్కాంచవేయా !", "స్వామీ నిదుర చాలించు", "మేము ఎదురు చూస్తున్నాము", "వేచియున్నాము", "లేచి చూడు" ఇది భక్తుని ఆర్తి. ఏడు దినములలో ఈ ఆర్తి మారి మారి లోకపు వెలుగును, లోవెలుగును చూడవలసి యున్నది. ఈ సూత్రార్థము ఆరంభ మహా మాత్రముగా మాత్రించి, నిర్వహణములో సర్వము కవి నివేదించు చున్నాడు.

"నివేదనలనే కొనవయ్యా !
నీ ప్రసాదముల నీవయ్యా !"

భక్తకాంక్షాపూర్తి వేంకటాద్రి నిర్వహణములో నున్నది. శ్రీ వేంకటేశ్వరుని దర్శించువారందరూ కొండను చూచి, గోపురమును చూచి, చూడవలయు వానిని, చూడదలచిన దానిని చూడలేకపోవుచున్నారు ఇందలి శేషాద్రి చూచి తిరువదనముచూచి మురిసిపోవగలరు మకుటము దర్శింపగలరు పూలంగి సేవలు, పవళింపు సేవలు, క్షీరాభిషేకము తామే చేసినట్లు సంతోష పడగలరు. కల్యాణోత్సవము బ్రహ్మోత్సవములలో పాల్గొని,

> "రమ్మన్నవి! రమ్మన్నవి!
> రమణా! సిపైన పూలు —"

అని అనగలరు. అప్పుడు "ఆహా! నీ గిరుల గొప్పమయా?" అని ధన్యమ్మన్యతను భావింపగలరు.

గరుడాద్రి నిరూపణములో కూర్మకవి తన కాలమునాటి లోకము చిత్రింపదలచెను. నిర్వేదము కలవారు భగవానుని సేవించువారు ఎట్లెట్లు భావింతురో యిందున్నది. తమ కర్మమర్మమును గుర్తింపక, దేవధర్మ మర్మములను గుర్తింపక అనువారు ఎట్లెట్లందురో యిందున్నది. కాని కవి అట్టివారలకు కొంత ఉద్బోధ మిచ్చెను. వృషాద్రిలో నొక విశేషమున్నది. చిలుక పదములు, మల్లెలో పదములు, చందమామ పదములు, అల్లోనేరేడల్లో పదములు, వెన్నెలాలో పదములు, ఉయ్యాల పదములు దీనిలో నున్నవి గొంతు విప్పగలవారు గీతము వినరువారు వీని పాడి పాడి పంట పండింప వలసియున్నది. వృషభాద్రిలో కొంత వేదన గలదు. మొరలున్నవి. కాని తెరచాప చూచి తన చదువు పరీక్షించుకొనుట గలదు.

> "నిను తెలియుటకే చదువులుగా!
> నిను కలియుటకే చదువులుగా!
> ... ... ...
> నీకై వెదకుటె నా చదువు —
> నిన్ను తలంచుటె నా చదువు!"

సాధకునకు దైవావేశము స్వప్నములో రావచ్చును నిమరలో ఆశ కలిగి నది దారి యేది ? శంక కలిగి తీరని చింతపడి ఆర్తి వెలిబుచ్చుట కలదు. భావవేగము కలిగిన కవి గబ గబ శ్రీనివాసుని దర్శింపవలెనని నారాయణాద్రి సమీపమునకు వచ్చి

"శరణం ప్రపద్యే

శరణం ప్రపద్యే"

అనెను. శ్రీనివాస చరణములకు మనచే వందనములర్పింప చేసెను. సాధక భక్తుడు భక్తి సాధనమునకు వృషభాద్రిలోని తీరని కోరికను నిరంతరము భావించుట సముచితము.

గేయాత్మకమయిన కృతి కంఠపు పోత యున్నంతకాలము ప్రసరించును అయినను వీనిలోని భావము సుప్రభాతముగ సుప్రసారము పొందుటకు తగిన సన్నివేశములను సూర్యనాథ కవి కూర్చెను. ఇది నవ కవిత యయినచో నిది మరల వేరొక నవేద్యము. ఇది అందరి గొంతుకలలో చేరి ప్రచారము పొందదగును శ్రీ తిరుపతి వేంకటేశ్వర దర్శనాసక్తులు సప్తగిరి యాత్రారంభములో దీనిని భావించుచూ వేంకటాద్రి చేరగలరు. కృతి భావనములో చూపగా వేంకటేశ్వరుడు సర్వజనులకు స్వాత్మయై భాసించును. స్వాత్మ వ్యాప్తికై సప్త చక్రవర్తిత్వము అవశ్యకము. కావున సర్వసాధకులు దీనిని ఆత్మహితకృతిగా భావింప తగును.

పకీథావి
కార్తిక కృష్ణ పర్వము.

జమ్ములమడక మాధవరాయశర్మ.
సాహితీ సమితి, గుంటూరు.

# ఒక్క మాట

నే నిదివరలో రెండు గేయ సంపుటాలు ప్రచురించాను— "నవనందిని" (1969) "కిన్నెర వీణ" (1972). అందు కొద్దిగా శ్రీ వేంకటేశ్వరుని మీద భక్తి గేయాలున్నాయి. కాని అన్నీ భక్తి గేయాలే ఆ శ్రీనివాసునిపై 108 వ్రాసి ప్రచురించాలనే అభిలాష ఈ మధ్యనే కలిగింది. ఆ సంకల్పం ఆ నారాయణాద్రీశుడే కలిగించా డని నా నమ్మకం. ఆ భారం ఆ దేవ దేవునికే వదిలేను సకాలములో పూర్తిగా వ్రాయ గలిగాను.

మహానుభావులెందరో ఆ స్వామి మీద గీతగానం చేశారు. కవిత లల్లారు. వారితో సరిపోల్చితే నే నెంత? ఏదో ఆ చంద్రుని కి నూలు పోగు.

ఇందు కొన్ని మాత్రా ఛందస్సు ననుసరించి వ్రాశాను. కొన్ని కేవలం పాటలు గా లయకు అనుకూలంగా నడిపించాను. కాబట్టి అన్ని పంక్తులూ ఒకే రీతిగా ఉండవు. కొన్నింటిలో Symbolism ఉపయోగించాను. ఏడు కొండల పేర్ల విష యంలో అన్నింటికీ "అద్రి" పదము అంతమున రావాలనే ఉద్దేశంతో మొదటిదానికి "శ్రీశైలాద్రి" అని పేరుంచాను. పైగా శ్రీశైల మనుటలో చదువరులకు శైవక్షేత్రము గుర్తుకి రావచ్చు.

జానపదుల్లో కూడా ఆ వృషభాద్రీశుని భక్తు లున్నారు. వారిది మూఢ భక్తి. అటువంటి భక్తిని వ్యక్తం చేసే పదాలు కూడా కొన్ని రచించి ఈ సంపుటిలో చేర్చాను.

పది మందీ చదివి పాడుకుంటే నా కృషి ఫలించినట్లూ నా జన్మ చరితార్థ మైనట్లూ భావిస్తాను.

సాహితీ సమితి
విజయనగరం
15-8-73

కొటికలపూడి కూర్మనాథం.

# కృతజ్ఞత

కోరినంతనే గ్రంథపరిచయ వాక్యములు వ్రాసిన మహోపాధ్యాయ శ్రీ జమ్ములమడక మాధవరాయశర్మగారికి

గ్రంథముద్రణకు ఆర్థికసహాయముచేసిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ (హైదరాబాదు) వారికి

నన్ను అనేక విధముల ప్రోత్సహించిన నా శ్రేయోభిలాషులకు



సప్తగిరి వాసుడు

శ్రీ

శ్రీనివాసుని దివ్య

చరణ

కమలములకు

ఈ

చిన్న కావ్య కమలము

భక్తి పురస్సరముగా

శ్రీ రమణా! శ్రితచరణా!

సురుచిరరూపా! ఓ రమణా!

పదపదమున ఈ గీతులలో
పలుకర శేషాచలవాసా!
భావము నీవే!
భారము నీదే!
రచియించేది
రమణా! నీవే!

చేసిన దీవె! మోసిన దీవె!
నాశము చేయకు నా ఆశ!
సకలము నీ వని నమ్మితిరా!
శకలము చేయకు నా బ్రతుకే!

# అనుక్రమణిక

శ్రీశైలాద్రి



శేషాద్రి



గరుడాద్రి

## తెల తెల్లవారింది

తెల తెల్ల వారింది తిరుమలేశా !
మేలుకో మమ్మేలు వేంకటేశా !

అల్లదే ఉదయాద్రి మేలుకొంది !
మేలుకొని దినరాజు నేలుకొంది !
చిరుగాలి చామరమూ వీచేనురా !
సరికొత్త పూలెన్నొ విరిసేయిరా !

వేదాల నదె స్రష్ట వినిపించెరా !
అదె నారదుడు మహతి మీటేనురా !
అలమేలు పన్నీరు తెచ్చేనురా !
ఆదిశేషుడు మున్నె లేచేనురా !

నదులన్ని క్రొన్నీట నడచేయిరా !
అందిచ్చె గగనమ్ము కలరవము తే !
జగ మేలు ఓ సామి మేలుకోరా !
పగ లొద్దు వ నొకింత తిలకించరా !

# మంగమ్మ

మంగమ్మ లేవమ్మ !
మాయమ్మ లేవమ్మ !
శ్రీ వేంకటేశ్వరుని
ప్రియపత్ని లేవమ్మ !

మధుకైటభుల నిట్టె పరిమార్చిన
మహనీయుడో యమ్మ నీ నాథుడు !
ప్రాణేశు వక్షాన వెలకొన్న దేవీ !
పాలింపగా లెమ్మ దివ్యస్వరూపిణి !

అరవిందలోచన ! వరదాయినీ !
ఆశ్రితజనులకు ప్రియదానశీల !
ఆహా ! ప్రసన్నవదన ! చంద్రమండల !
అపురూపమే మాకు నీ రూపము !

అంబా సరస్వతీ శచీ వచ్చిరి —
అలమేలు ! తిలకింప వేవేగ లే
ఆ వెంట నీ నాథునే లేపవే !
అందరికి ఆనందమే ఈయరే !

---

సప్తగిరి ధ్వనులు

# లేవయ్యా

లేవయ్యా రఘుణయ్యా !
లేవోయి నిదుర —

కౌసల్యా తనయా !
కలికావతారా !
కనువిప్ప వేమోయి
కారుణ్యధామా !

లేవోయి గోవింద !
లెమ్మా గరుడధ్వజ !
లెమ్మా లక్ష్మీనాథ !
లెమ్మా నారాయణా !

ముల్లోకములకు శుభ
ములు కూర్ప లేవోయి !
త్రైలోక్యమంగళా
చరణ ! లే లెమ్మా !

# మేల్కాంచవోయి

ఓ స్వామి ! మేల్కాంచవోయి !
నిను చూడ వేలాది
నిజ భక్తులే వచ్చె —

తొలి సంజ లేచింది !
తెలి వెలుగు పరచింది !
నిత్యకృత్యము లెన్నొ
నీ కొరకు నిలచేయి !

శంభుడును, ఇంద్రుడును
షణ్ముఖాదులు వచ్చి
వినుతించు చున్నారు —
వినలేద ? దేవ !

వాచస్పతే నిలచి
పంచాంగమే చదివె
వల దింక ఆ సుప్తి
వరదానశీలా !

# ఇంక వలదు

వల దింక నీ నిదుర
వరదా ! దయుంచు !

నీ పాద పద్మాల
నే చేరి పూజింప —
ఆకాశ గంగలో
అరవిందములు కోని
అత్రి మొదలైన ఋషు
లంద రేతెంచేరు —
శేషాద్రివాసా !
శయనింప కింక —

గజరాజు, మృగరాజు,
గరుడు డుచ్చైశ్శ్రవము,
ఆదిశేషుడు వచ్చె —
అధినాథు ధాటిలో
మహిమాధికారాలు
మా కీయ మని వేడ —
లోకేశ ! లే వోయి !
చీకాటు పడ కోయి !

బ్రహ్మ, సనందనుడు,
ధర్గుండునూ కూడి,
పుష్కరిణిలో మునిగి,
పూలు కొని వచ్చారు —
దేవళపు ముంగిటను
దేవాది దేవా ! —
వేచియున్నారదే
వేంకటేశా లెమ్మ !

# చాలించు

చాలించు మో స్వామి !
చాలించు నిదుర !

నారాయణాద్రీశ !
నారదుడు మైమరచి
మునిగోట మహాతినే
ముద్దుగా మీటుచూ
సొంపైన నీ చరిత
మింపుగా పాడగా
భాషామతల్లికే
భరతనాట్యము తోచె —

దేవగణమే నిలచె
దేవళపు వాకిటను
వేదవేద్యా యనుచు
వేనోళ్ళ వినుతింప —
వినలేద ఓ దేవ ఆ గీతులు !
కననిమ్మ నీ ప్రభల పది రీతులు !

ఆలయమ్మున చేరి
అనలదేవుని తోడ
అష్ట దిక్పాలకులు
అంజలి ఘటించేరు
అపురూపమగు రూపు
ఆశతో తిలకింప —
ఆనిదుర చాలించు!
ఆదరణ చూపించు!

# జోహారు

జోహారు లేవోయి పురుషోత్తమా !
జోషమ్మునో మఱచి నిదురొద్దురా !

కొలదిగా వికసించు
కోనేటి కమలాలు,
నారికేళము, పోక,
నానావిధము లైన
తరులపై గంధాలు
తలపైన మోయుచూ,
మలయానిలము వీచె
మహనీయ ! లేలెమ్మ !

శతపత్రపద్మాల
శయనించు భృంగాళి
కుసుమాల శోభనే
కులుకుతో కొల్లగొని

ఝుంకార మను భేరి మ్రోగించెరా !
జగతిలో చైతన్యమే లేచెరా !

మంచి పంజరమందు
మసలు చిలుకలు లేచి
పాతివ్రత్య శిష్టమగు
పాయసము ఫలములను
కుడిచి కులికెను - లెమ్ము లోకేశా !
కూసె మేల్కొలుపులే నీ కోయి !

# లెమ్ము మధుసూదనా!

మధుసూదన మేలుకొమ్ము !
మా సేవల నందుకొమ్ము !

పరిసరాల సరసులలో
పద్మములే నవ్వె — వాని
ఉదరములను నిదుర లేచి
మధురోహాల నళికములే
మకరందము చిందించెను
మరపురాని గీతులలో —

ఎంచి ఎంచి మంచి మంచి
ఏలకులను లవంగములు
పచ్చకర్పూరములే
పదిలముగా కలిపిన ఆ
కాశ గంగ కలశములతో
కాచియుంటి రోయి దేవ !

క్రొత్తగ విరిసిన పూవులు
కోసి తెచ్చినామురా !
సాంద్రముగా చందనమే
స్వామి సిద్ధమాయెరా !
పాదతీర్థమును కోరిన
పామరులము వేచినాము !

# ఎదురు చూస్తున్నాము

నిదుర మేల్కొనవోయి దేవా !
ఎదురు చూస్తున్నాము లేరా !

గొల్లభామలు వాడ వాడల
చల్ల చిలికే కడవలను - ఆ
ధ్వని ధ్వనించే దిక్కు లన్నియు
ధాటితో కలహించుచున్నవి !

లేగదూడలు పాలకొరకై
ఛంగు ఛంగున గెంతెరా !
ఆవు లన్నియు ప్రేమ చూపుచు
అరచెరా అంబా యని —

కుక్కుటములే వేగలేచి
కొక్కొరో యని కూసెరా !
కష్టజీవులు పొలము పనికై
ఏటి గట్టున సాగెరా !

# వేచియున్నాము

వేలాదిగ వేచినాము
వేంకటేశ ! మేల్కొనరా !

సప్తగిరులపై వెలసిన
సన్నుత ! ఓ సనాతనా !
సంసారాంబుధి దాటగ
సాధన మగు నావ నీవె !

శతమన్మథ సుందరా !
శాశ్వత ! సుగుణాకరా !
నీ దీవెనకై నిలచితి
మో దేవా ! లేవగదే !

మోక్షకాములైన కూడ
మోహింతుము స్వర్గాగ్రం —
కోటి జన్మలకు నైనను
కోరుదు మది తిలకించుట —

---

శ్రీ శైలాద్రి

# లేచి చూడు

ఓ స్వామీ లేచి మమ్ము చూడరా !
ఊడిగాలు పొంది మమ్ము కావరా !
విరసన భరియించలేని దీనులం !
పరమాత్మా ! పరితపించువారలం !

పాదధూళి వెలు గిచ్చే శిరసులు !
పరమపదపు సుఖము కోరు మనసులు !
కల్యాగమకాల భీతహృదయులు !
కాలహారణమే వల దను జీవులు !

పాప పంజరములోపలి పక్షులం !
పరమాత్మా ! శరణు కోర భాగ్యులం !
ఓ అభీష్టవరదా ! ఓ సతీసమేతా !
ఓయీ ! జగదేకదయాసముద్రా ! ప్రభూ !

శ్రీమంతా ! అనంతా ! శ్రీగిరీశ్వరా !
శ్రీపతి ! మా గతి నీ పదయుగళమే స్వామీ !
గరుడాదుల సేవలలో మునిగితేలుతురా !
కనరా ఓ లీలామానుషరూప ! దేవా !

# వేంకటాచలము

ఇదే వేంకటాచలం !
ఇదే సురపురం !
మన నేతే శ్రీవరదుని
మహా ఇంద్రప్రస్థ మిదే —

ఇది సువర్ణ గోపురం !
ఇది పుష్కరిణీ జలం !
ప్రాకారములందు నిలచు
సాకారస్వా మతడే !

నవరత్న కిరీట మదే !
నాక మిచ్చు నామ మదే !
కమలాక్షుని నగుమో మదె !
కరుణ చిందు చూపు లవే !

కరి గాచిన చక్ర మదే !
కమనీయపు శంఖమదే !
దేవులు ఎదపై నరుఁగో !
దేవుని పీతాంబర మదె !

సుప్రసూన మాల లవే !
సురుచిర రూప మ్మదే !
అభయహస్త మదే ! శ్రీర్ధ
మదే ! పాదయుగళ మదే !

# నీ కొండ

నీ కొండే సురలోకమే !
— ఔనౌను
నీ వుండే వైకుంఠమే !

నిత్యసేవల పూల
నిరతమ్ము విరజిల్లు !
నీకంటిలో జాలు
కరుణామృతపు జల్లు ! —
సందర్శనము బాపు పాపం !
— మా కింక
సంకీర్తనమె కైవల్యం !

ప్రతి నోట నీ నామమే !
ప్రతి చేత నీ రూపమే !
ఎట గన్ననూ భక్తులే !
ఎవ రైననూ ముక్తికే !
ఏమందు నీ శోభలు !
— నీ కివె
నా వందన శతమ్ములు !

# గోపురం

అల్లదిగో కనుపించె నదె గోపురం !
ఆనంద డోలల నా అంతరం !
ఆకాశ సీమల నా గోపురం !
లోకాన శాంతికి అదె కాపురం !

బహుశిల్ప సంపద !
బంగారు తళతళ !
గాలిలో పాడింది
ఘనరాగమాల !

మా బాధలను తీర్చ
నీ బంటుగా తోచు !
ప్రాకారముల పైన
అకలంకముగ నిల్చె !

ఆగుడికి శిఖరాల ?
ఆకాశ వీణలా ?
నింగి నీలిని తేలు నిగనిగల సొగసుల
రంగారు శతపత్ర కమలమ్మిదా ?

# అదిగో !

అదిగో మ్రోగెను జేగంట !
ఆధ్వని సాగెను విను వెంట !
ఆహా ! స్వామికి మేలుకొలుపులు !
అవె నా మదిలో వేడుకలు !

అదిగో దీపము వెలిగింది !
అది గుడినే వెలిగించింది !
ఆహా ! స్వామికి కళకళలు !
అవె నా మదిలో దీపికలు !

అభిషేకమునే చేసేరు !
అంతట పూవులు చల్లేరు !
ఆహా ! స్వామియె పూలాయె !
అవె నా మదిలో మెదిలేయి !

కర్పూరహారతు లిచ్చేరు !
కలియుగేశునే చూపేరు !
కన్నులస్వామికి తళతళలు !
కలలో నా కవె కిలకిలలు !

# తిరు వదనము

శశిరేఖ తిలకింప ఆనందమే !
శశిరేఖ లెన్నో నీ వదనమ్ములో !

నిరతమ్ము చూపును నీ మందహాసం !
స్వర్లోక హాసాల హార్మ్యాంతరం !
నీ చూపులే చల్లు చల్లందనం !
నీ వాకిటను చింతకే అంతము !

నీ పాదపద్మాల నీడలోనె
నిలిచేయి నే కోరు నిధులెన్నియో !
కరమందు కల దోయి నా కభయము !
పర చింతకే పథము తిరు నామము !

నీ కొండ వినుప్రోలు సోపానమే !
నీ ఆనలో కదలు భువనమ్ములే !
నీ రూపు వర్ణింప నే నెంతరా !
నా రక్షకుడ ! సాధ్య మెవ్వారికి ?

# మురిసితి

మణిమయ మకుటము
మనసార చూచి
మానస హ్రాదమున
మరాళ మైతిని !

కానుల పేరును
కనులార చూచి —
వన వీధులలో
వకుళము నైతిని !

విరిసరులన్నిటి
నరసేనయ్యో !
ఏ తీ బ్రతు కిక ?
ఫల మే దంటివి !

ఎద పై సతులను
ఆదె తిలకించితి —
పాపపు మూ టీ
చెడు బ్రతు కంటిని ।

తిరునామము నే
తిన్నగ నరసితి
తీరే లే నొక
తి త్తిని అంటిని !

---

సప్తగిరులు

# ప్రాకారాలు



కనరండి ఆ మూడు ప్రాకారముల్ !
కాంచేటి వరదుని వైభోగముల్ !

లోకేశునే తలచి
లోలోకి ఏగంగ
వసుధ వలయము పైని
వైకుంఠ మనిపించు —

లోభాది దుర్గుణము
లొక్కొక్కటి హరించి
మనలోన పరచింత
మంచులా తేలించు —

ఏడు జన్మల నైన
ఏకమై కూడిన
పాపాలనే ఇట్టె
పారద్రోలెడి మందు —

## మకుటం

మణి మకుటం !
మణి మకుటం !
మై మరపించుట,
ఏ మనటం ?

కౌస్తుభమణిలో తళతళలా ?
ఇంద్రనీలముల మిలమిలలా ?
ఇలలో మా కానంద నందనం !
ఇదె మము కాచే గోవర్ధనం !

కెంపులు వల దను అపచారం !
నీలము హరించు మా లోభం !
మాణిక్యము కొను మాత్సర్యం !
పచ్చలు చూపును పరమార్థం !

రత్నము వల దను నీ క్రోధం !
గోమేధిక మార్చును కామం !
వైడూర్యము కొను మా మోహం !
వజ్రము చూపును వైకుంఠం !

# పూలంగి సేవ

తిలకించ రండి !
పూలంగి సేవ !
శ్రీ వేంకటేశుని
శోభే మనందు !

మనసైన మల్లెల
మకుటమ్మదే !
అరుదైన రోజాల
హారమ్మదే !

సరి లేని సంపంగి
సరులె కంఠాన !
కనకాంబరము లెన్నొ
కరము లను కొలువ !

పాడాంబరము లెన్నొ
వక్షాన తూగ !
చేమంతులే చేరి
చరణాలు కొలువ !

వేలాడి విరు లెన్నొ
నిలు వెల్ల నిలువ
కను విందులే కదా
కలలందు కూడ !

శేషాద్రి

# పవళింపు సేవ

ఊగరా ఉయ్యాల లూగరా !
— శయనించి
ఊగరా ఉయ్యాల లూగరా !

బంగారు రంగారు ఉయ్యాలరా !
సంపంగి రోజాలు పరు పాయెరా !
చేమంతి పూబంతి దిం డాయెరా !
పట్టుశాలువ పైన పరచేరురా !

మేళాలు తాళాలు మోగేనురా !
మెప్పించు గీతాలు పాడేనురా !
పదిమంది దరిసించి మురిసేరురా !
పాపాల మలినాలు కడిగేరురా !

దివినుండి జేజేలు తిలకింపగా !
దీపాలు ఎన్నెన్నో వెలిగేనురా !
జేగంట లెన్నెన్నో రవళించెరా !
జగమేలు వేంకన్న పవళించరా !

## క్షీరాభిషేకం

గిరివాస ! చూసేను
క్షీరాభిషేకం ! — శేష
గిరివాస చూసేను
క్షీరాభిషేకం ! —
కలశాల మటు ఉండి
కన జన్మ ధన్యం !

పసిడి పాత్రిలలోని
పాలు నీపై ఒలుక,
క్షీరసాగరశయన —
పేరు నీకే చెల్లు !

నిను కడుగు క్షీరమ్మె
కని నంతనే తోచె —
పాపాలు నాలోన
ప్రక్షాళితము లాయె !

గోవు లా పా లీయ
గోవింద ! తన నేమి
ఒనరించె ? కరుణించు
నే కూడ తరియింతు !

---

శేషాద్రి

# కల్యాణోత్సవం

కనరండి ఆ స్వామి
కల్యాణ వేడుకలు !
కోటి జన్మల కైన
కోరి కన నౌనండి —

పట్టు బట్టల స్వామి —
పక్క నుం దలమేలు —
వీనులకు విం దౌను
వింత వాద్యా లెన్నొ !

కల్యాణ తిలకమ్ము !
కమనీయ రూపమ్ము ! —
వరుడుగా వేంకటే
శ్వరుడు కనిపించె నదె !

వరు డతడో !
స్మరు డతడో !
వైకుంఠమును వీడి
వచ్చె ననిపించును !

---

సప్తగిరులు

# బ్రహ్మోత్సవము

భక్తులార చూడ రండి
బ్రహ్మోత్సవ సంరంభం !

చతుర్ముఖుడు దశదినములు
జరిపించిన, తను మురిసిన,
మూడేండ్లకు ఒక్కసారి
ముచ్చటైన పండ గిదే !

శేష హంస కల్పవృక్ష
సింహ గజాది ద్వాదశ
వాహనముల ఊరేగే
వరదుని మనసార కొలువ —

ముత్తెపు పందిరి క్రిందను
ముద్దు లొలుకు శ్రీపతినే —
మణి దీపములతో వెలిగే
మంటపమున మలయప్పని —

గరుడోత్సవమును కాంచిన
గతులు మారిపోవు నండి !

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

శే షా ద్రి
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

ధ్వజారోహణము స్వర్గ
ద్వారము తెరిపించు నండీ !

దంతపు పల్లకి నాతని
ధగధగ యను మోహినిగా,
అవభృథోత్సవము నరయ,
అన్య చింత లంత మౌను !

దీపతోరణముల నిండు
దేవళ మొక మకుట మౌను !
భక్తి గీతములు సదస్సు
ముక్తి మార్గదాయకం !

## రమ్మన్నవి

రమ్మన్నవి ! రమ్మన్నవి !
రమణా ! నీ పైన పూలు —
కనులు చేసి తను వంకా
కనుమన్నవి ! కనుమన్నవి !

పొన్నకు నీ పాదము లట !
పొగడకు నీ కరము లట !
కమలమునకు కన్ను లట !
విమలతేజ ! విశ్వరూప !

శిరీషమునకే శిర మట !
చేమంతికి వక్షమ్మట !
మల్లెకు నీ కంఠ మ్మట !
మహాప్రభో ! మధుసూదన !

తొలి సంజను కనులు విప్పి
పులకింతుము స్వామి పైన —
మా బ్రతుకులు దిన మైనా
మా జన్మలు ధన్య మ్మని —

---

శేషాద్రి

# వైభవము

ఏమి వైభవ మోయి!
ఏడు కొండల వాడ!
నర జన్మమున చూడ
నడచి వచ్చును ముక్తి!

కొత్త మల్లెల మాల
కోరి ఎద నూగింది!
కొత్త రోజా లెన్నొ
మత్తిల్లె కంఠాన —

జాజిపూసరు లెన్నొ
జఘనాన నిలచేయి!
సంపంగి పూ లెన్నొ
సందడించెను తలను!

చేమంతులే కరము
చేరి కొలిచెనురా!
వాడాంబరము లెన్నొ
వరుస తీరెను పైన —

సప్తగిరులు

## గొప్పతనము

అప్ప ఏమందు నీ
గొప్పతనము !
చెప్పు మాటలు కావు
ఒప్పుగా కనుగొంటి !

ధన ధాన్యముల నెన్నో కురిపి తురే !
ఘన మైన దీపాలు వెలిగింతురే !

నీ కిచ్చి కేశములు కై మోడ్తురే !
నీ వాకిటను దొర్లి నిను పిలుతురే !

కల్యాణములు నీకు చేయింతురే !
కనకాభిషేకములు జరిపింతురే !

తప్పులను కాచేటి వరదుడవు నీ వంట !
నిప్పులా పాపాలు నీ ముందు నసి యంట !

---

శేషాద్రి

# ధన్యులు !

ఏ పూజలు చేసినారో ? ధన్యులు !
— వారంతా
నీ పూజలు చేసినారు ధన్యులు !

గోడలు కట్టిన వారలు ధన్యులు ! ధన్యులు !
గుడి కట్టిన శిల్పు లంత ధన్యులు ! ధన్యులు !
ప్రాకారాల్ కట్టించిన ధన్యుడు ! ధన్యుడు !
ఆ సాళువ నరసింహుడు ధన్యుడు ! ధన్యుడు !

పాండ్య చోళ పల్లవ బళ్ళాలే కద ధన్యులు !
భళిరా ! దానా లిచ్చిన వారలుగా ధన్యులు !
రమణా ! నీ పూజ రీతి చూపి నతడు ధన్యుడు !
రామానుజుడే అహాహా ! ధన్యుడు ! ధన్యుడు !

నీ మండపమును కట్టిన వారలే ధన్యులు !
నీ బలిపీఠము కట్టిన వారలే ధన్యులు !
ఎత్తినారు ధ్వజస్థంభమే — వారలు ధన్యులు !
ఏకంగా బంగారము పట్టించిరి ధన్యులు !

# వృధా !

వృధా ! వృధా ! అది వృధా ! వృధా !
ఏమి చేసినా, ఏమి తలచినా
సర్వము గరుడాద్రీశునకే యను
భావము నీలో నిదురిస్తే —

ధానధర్మములు చేసేవు —
ధర్మకర్త నని అంటావా ?
నిన్నందరు మెచ్చాలంటూ
నీ పేరే చాటించావా ?

యజ్ఞయాగములు చేస్తావు !
యజమానిని నే నంటావా !
ఎల్లరి నాహ్వానిస్తావు !
ఏదో జరిపించేస్తావా ?

వేదాధ్యయనం చేస్తావు
వేద వేద్యునే మరచావా ?
పురాణ పఠనం చేయిస్తూ
పునీతుడయ్యా నంటావా ?

అర్చనలే చేయిస్తావు !
హారతులే ఇప్పిస్తావు !
ఐదులు వందలు చదివిస్తూ
వందలు వేలూ కోరేవు !

# మందు కాని మందు

మందు లన్నిట మందు
మహా మంచి మందండి !
మరి కొంచె మనిపించు
మనసు పెంచెడి మందు !

పంచదారయుగాపి
పనస తొనలే గాని
పనికిరా వనిపించు
బహు తీపి మందిదే —

అడవిలో వెదకినను
అద్రి నైనను కాని —
గిరుల పై దిరిగినను
కిట్టనిది ఈ మందు —

జడపదార్ధము నైన
చలియింప చేయు పేట —
గోవింద నామమే
గొప్ప దగు మందండి —

# నా మ మ హి మ

వేంకటేశ్వరుని నామము
లో కల దండి —
వే రెక్కడ లేని మహిమ
వెదుక కండి !

చిత్తమునకు మత్తు నీయు
చింతనామృత మ్మదే !

శాంతిని కాపాడు నండి ఆ నామమే !
భ్రాంతి తొలగచేయు నండి ఆ నామమే !
జాల మేల ? రండి రండి ఓ నరులారా !
జపించండి గోవిం దని పామరులారా !

వింత సుఖము నిచ్చు నండి ఆ నామమే !
వంత లన్ని తీర్చు నండి ఆ నామమే !
జాలమేల ? రండి రండి ఓ నరులారా !
జపించండి గోవిం దని పామరులారా !

పాప నాశనమ్ము చేయు నా నామమే !
పండించును మన ఆశలు ఆ నామమే !
చాలు జాల మింక రండి ఓ జనులారా !
జపించండి గోవిం దని ఓ నరులారా !

# దుస్సాధము

దరిశనమునకై
తిరుపతి వచ్చితి —
వెనుదిరుగుట ఎటులో ?
వేదవేద్యుడా రమణా !

దారా సుతులను మమత లింకెరా !
ఔరా ! నీ వే మందువురా ?
అందువురా —

ధనధాన్యము లను బాధే సమసెను
దనుజవైరి ! నీ మహిమే గా ?
మహిమే గా —

నీ నా భేదము ఇంకి పోయెనే !
నీ రూపములో శక్తి యదా ?
శక్తి యదా ?

తెరచెను పాపపు పంజర ద్వారం !
అరచెను మానస పికము "పరం !
పరం ! పరం !"

## లీల

ఏ మిది నీ లీల ? రమణ !
ఎందుకు ఈ ఆట ?—

అసలు లోక మెయ్యదో ?
అంతయు మాయే కదా ?
ఏల నిచటి కొచ్చేమో ?
ఏ మానో కదా కడకు ?

ఒకనాటను కనులు తెరచి
పరిక్క నమ్మవే చూస్తాం !
నీకు దూర మౌతామే :
లోకంతో ఒక రౌతాం !

ని న్నెరిగే సరి కయ్యో !
ఎన్ని పాపములు చేస్తాం !
ప్రాకులాట జీవితాన
పారద్రోలు నెచ్చటకో !

# వింత

లోకమే వింత !
— దాని
పోకడే వింత !

స్వంత కాంతపై కొంత
ఇతర ఇంతిపై నెంతో
కోరిక లూరే జనులు !
తీరిక ఎరుగని పనులు !

కలిమి ఎంతయో ఉన్నా
కావా లంటారు కదా !
పేదల మాటంటే అసలు
పెదవిని పుట్టదు దేవా !

పగలను తీర్చుట కేవేవో
పనులను తలపెట్టెదరే !
క్షమ అను మాటయె లేదే !
శమనము అస లెరుగరుగా !

# హే తు వే ది!

పడతికే పెట్టేవ
పదివేల అర్హతలు
పురుషు నాకర్షింప ?
గిరి నున్న రమణా !

జవరాండ్రి జడలలో
జాజు లేలను ? స్వామి !
నీ పాదముల కిచ్చు
నిజ మైన శోభ కద ?

మహిళ వాల్యాప్రులో
మహిమ దేలను ? స్వామి !
నీ చూపులో కలదు
నిజ మైన ము క్తి !

పురుషు నోడించేటి
సరసాంగి అబ లౌను —
పరమార్థము ను పెంచు
పరమేశ నీ ముందు.

# ఏల!

ఆడ కాపుర మేల
ఆ యేడు గిరులపై ?
చేరి చూతా మంటె
తీరు తెన్నులు లేవు —

సడి లేని చీకటులు
సవ్వాలు చేస్తుంటె
గోవింద యనుచు నీ
గోపురము చేరాల ?

రాకాసి వలె ఒంగు
ఆకాశ మా డుంటె
గుండె దడదడ మంటు
గుడిచేరి చూడాల ?

లోకాన పాపాలు
కాకోల విష మైతె
కొండపై కాక నీ
వేడ నుంటా వనా ?

## అశాశ్వతము

పట్టుకు పోతారా ? స్వామీ !
కట్టుకు పోతారా ?

మూడు జాములో
ముష్టి బ్రతుకులో —

బహు భార్యలతో కులికే దొరకడు
భవబంధాలను పెంచే దొరకడు —
వీరు వారు వెంటను వస్తారా ?
వేంకటాద్రిపై వెలసిన దేవా !

మేడలు కట్టే దొరకైతే
ఓడలు నడిపే దొరకైతే
మేడలు ఓడలు వెను కొస్తాయా ?
ఆడను కొలువగు ఓ రమణా !

ధనధాన్యమ్ములు చేర్చే దొరకడు
మనదను మమతలు పెంచే దొరకడు
వెను కొస్తాయా ఆ లోకానికి ?
వేంకటాద్రిపై నిలచిన దేవా !

# చెడ్డ పనులు

చెడ్డపనులు మానండోయి !
చేతులెత్తి మొక్కండోయి !
ఖగవాహనుడు మన
జగ మేలు రమణకు —

నోరార గోవింద
ఔర నీ అనరా !
చే యెత్తి మొక్కితే
చెదరు నీ పాపాలు !

వరుస జన్మలలోన
వరము ఏ ముండిరా ?
వేంకటేశుని గనుట
వేరు జన్మిక లేమి —

పంటలకు కర వౌను !
పాపలకు కర వౌను !
గరుడాచలేశ్వరుని
కరుణకా కర వౌను !

---

గరుడాద్రి

# ఒకటే మందు

మందు ఒకటే నండి రండి !
మందు ఒక టండి !
మునుల కైనను సురల కైనను
జనుల కైనను వేంకటేశుడె —

అన్న బాధ కజీర్ణ బాధకు
అన్ని బాధలు తెచ్చు మనసుకి —

గూడు లేమికి ముళ్లు వారికి
గుడ్డ లేమిని నిలచు వారికి —

అనృతమునకును జీవహింసకు
అన్యవాంఛలు పెంచు బాధకు —

# నిజము

ఏలరా ? వెనుకాడ నేలరా ?

— ఓ స్వామి !

ఏలరా ? వెనుకాడ నేలరా ?

నే నెరిగిన నిజ మిది దని

నేరుగ నా నోట దెలుప —

నీ రూపం కనజాలని కను లేలరా ?

నీ సుమపరిమళ మ్మొందని నాసి కేలరా ?

నీ పూజలు చేయలేని చే తులేలరా

నీ భజనలు వినజాలని వీను లేలరా ?

నీ ప్రసాదమే కుడువని నో రేలరా ?

నీ నామస్మరణ లేని నాలు కేలరా ?

నీ కొండకు నడువ లేని పద మేలరా ?

నీ పైనే నిలుపలేని మన సేలరా ?

నిన్నే నమ్మని జీవుల మ్మని కేలరా ?

## అసలు రహస్యం!

తెలిసిందిలే దేవ !
తెలిసిందిలే —
నీ తీరులో దాగు
అంతర్య మంత —

ఏ మైన నీ పెదవులే విప్పవు !
ఏక దీక్షగ మేము కొలవా లని
కొలవా లని —

వడ్డికాసుల పేరు వేసేవులే !
వడ్డిగ పుణ్యాలె పెంచా లని
పెంచా లని —

ఎదపైన సతులనే నిలిపేవులే !
ఎదలోన భక్తుడు ఉండా లని
ఉండాలని —

ఒక చేత చరణాలె చూపేవులే !
మా కలియె తరియించు పథమే నని
పథమే నని —

వామ హస్తము శాస్త దించేవులే !
పాపాత్ములను ఉద్ధరించా లని
బా నందుకే —

ఘోరము!

ఏమి తెల్పుదు నోయి వృషభాద్రివాసా !
ఏదియును తోచదే వృషశైలవాసా !

అవినీతి అందల మ్మెక్కి కులికెనురా !
ఆ వెనుక నడచు టాయెను నీతి బ్రతుకు !
ఈ యుగపు మహిమ మదా ?
ఇది నీదు లీలా ?

తల్లిదండ్రులు లేరు
తనవారు లేరు —
తగినంత ధన మంచె
తరలిపోతారు !
ఇది నీదు లీలా ?
ఈ యుగపు మహిమా ?

అనృత మ్మంచేను
అసలు జంకే లేదు
అయ్యో ! రోజంతయును
అదె జీవన మ్మాయె !
ఈ యుగపు మహిమా ?
ఇది నీదు లీలా ?

# నాటకము

నాటకాల వార్తలంట
నాటకాల వారు —
నటియించుచు జీవన మట
నడచి వచ్చినారు !

దేశ దేశములు తిరుగుచు
వేషమేసి రంట —
పారితోషికాలు పొంది
పయనమాయె నంట !

రకరకాల దుస్తులతో
ముఖ కవళిక మార్చి
మై మరువగ వను తణము
మాయ చేసి రంట !

నేటికి తెలిసెను భళిరె !
నాటెను నా మదిలో —
వేంకటేశ్వరుని నాటక
మే కద నా మనికని !

సప్తగిరులు

# జూదము !

జూద మాడినారా — డబ్బులు
జూద మాడినారా !
ధనము పోయి నే బిచ్చ మెత్తుకొను
దాసరి నై తినిరా ! వేంకన్న
దాసరి నై తినిరా !

పరువు పోయె నని
పరితపించితిని —
బరువు బ్రతుకు యని
బాధ పడితినే —
లేమి తోడనే కుమిలితిని !
ఏమి గతమొ యని కుందితిని !

అందర జూదరులే అంటూ
మందమతుల అయినా రంటూ
అనుక్షణం అది పీడకుగా —
అను కొని నే మే లనుకొన్నా !

అజ్ఞానపు పాచికలను వేసి
అభిమత మ్మును వేదిక పైన
కాలము నే కా సాడేరు !
కామాదులకే ఓడేరు !

# భయం - నయం

భయం ! భయం ! అది
నయం ! నయం ! ఇది —
భయం ! భయం !
నయం ! నయం !

కాకుల బోలెడు లోకుల జేరి
ఖచ్చితముగ మసలుట భయం ! భయం !
కాంత సన్నిధిని కాలము గడపుచు
కన్ను మూయుచే నయం ! నయం !

గరువముతో బలవంతుడ నే నని
పరులను కొట్టుట భయం ! భయం !
తాగి పడుంటూ సకలము మరచుట
తపస్సు వంటిది నయం ! నయం !

మూర్ఖునిగా పరులను దూషించుట
ముప్పు కదా అది భయం ! భయం !
మతి చెడి ఉండుట అండము రీతిగ
మహిలో నెంతయొ నయం ! నయం !

పాపము చూస్తూ శక్తి లేమిచే
ఆప కుండు టది భయం ! భయం !
కొలువగ దిక్కని వరదుని పదములు
కొండ చేరుచే నయం ! నయం !

# కరము

ఆ కరముతో మాకు
అభయమ్ము నీయర !
అదె జన్మ జన్మల
అఖిల పాపము బాపు —

కనికారమును తెల్పు నా కరమెగా !
కనకంపు తళు కిచ్చు నా కరమెగా !
ఆకారమున చిన్న దై యున్ననూ
రాకాసివలె మారి జడిపించునే —

చక్రమ్ము పట్టెను ఆ కరమెగా !
చలియించు జగమేలు నా కరమెగా !
శివధనువు పట్టింది ఆ కరమెగా !
శిశుపాలు ద్రుంచింద ఆ కరమెగా !

మురళి మోవిని చేర్చె నా కరమెగా !
మునివేళ్ళ మ్రోగించె నా కరమెగా !
గండ్రగొడ్డలి బట్టె నా కరమెగా !
కాపాడి రక్షించు నా కరమెగా !

# దిక్కులు

ఎవ రన్నారో కదా —
దిక్కులు పది కాదురా —
ఏదో అజ్ఞానములో
చుక్కలు లెక్కిస్తూ !
దిక్కొక టని నే నంటా
దిక్కు నీవే స్వామీ !

మొక్కిన నీకే మొక్కులు !
నిక్కపు మనసును విప్పితి !
అక్కర మాటలు కావుర !
అల్పాన కది చెల్లునులే !

పాలము చూసిన పాపడు
నేలకు విసరును గిలకను —
వెన్నగ తన మన సున్నది
వెన్ను డొకడె యని నమ్మితి !

పలుగాకుల పలుకులకేం ?
పెంచిన పలికే స్వామివి !
మనసున మా కోర్కె దీర్చి
మము కాచే వరదుడవే !

# చోద్యము

ఏ మిది నీ మహిమ ?
ఏలిక ఇది నిజమ ?
        కలియుగాంత మందునా ?
        బళి యుగాది అందునా ?
మింగ మెతుకు లేని వాని
మీసములకు మల్లత్తరు !
మితిమీరిన నాగరికత
మిన్నువైపు దృష్టి నిలిపె !
        ఇది యుగధర్మమ్మునా ?
        ఇది మా కర్మమ్మునా ?
పాపములను చేసి చేసి
పద కాశీ కందురే —
పాప మేల ? పతన మేల ?
పరమ పదము కాంచరే —
        ఇది నీ మర్మమ్మునా ?
        ఇది మా కర్మమ్మునా ?
అపకారము చేయు చుంటె
ఉపకార మ్మని నమ్మెద —
పాపములే దావ మిచ్చు
పరమ కిరాతకులు హెచ్చె —
        అయ్యో ! జగ మంతమా ?
        అంతా వింతౌనుగా !

# అంధులు

అంధుల మనుచూ
కొంద రెంచుకో
ఈ ధర నేడుస్తా రయ్యా !

లోకపు పాపము చూడని వారు
శోకపు చీకటిలో పడు టేల ?
కనులు విప్పి తిలకించుటచేతనె
కాపం లనియెడు కోరిక పెరుగును !

ఎందరో కామాంధులు కలరే !
ఎందరో క్రోధాంధులు కలరే !
ఎందరో లోభాంధులు కలరే !
ఎందరో మోహాంధులు ఉన్నా —

సకలము నీ వని తెలియని వారికి
సర్వేశ్వరు డని ఎరుగని వారికి
జన్మమె స్థిర మని అనుకొను వారికి
జ్ఞాననేత్రమే మృగ్యము కాగా —

# మరువరు

మానవు లంతా మరువరుగా
మరల మరల నిను తలవరుగా !
మరణాంతరమున మరి యే మానని
మదిలో చింతలు పెట్టరుగా !

మరువరు ఆహారము లన్నీ !
మరువరు పానీయము లన్నీ !
మరువరు దుర్గుణముల నన్నీ !
మరువరు భవబంధములన్నీ —

మరువరు అజ్ఞానము నంత !
మరువరుగా పాపపు చింత !
మరువరు ఇంద్రియ భోగములే !
మరువరు కపటపు వర్తనలే !

తలవరు వంతల వర కంతా
తలవరు పున్నెపు యోచనలే !
తలవరు ఉపకారపు చింత !
తలవరు దేవా ! నిన్నంతా —

---

గరుడాద్రి

## కా వా లి

కావాలి ! అది కావాలి !
కలకాలం అది కావాలి !

ఆకలి కన్నం కావాలి !
దప్పికి తీర్థం కావాలి !

విటులకు కాంతలె కావాలి !
విరహిణులకు ప్రియుడే కావాలి !

పాపకు తల్లే కావాలి !
భక్తునికే నవు కావాలి !

కావాలి ! అవి కావాలి !
కలకాలం అవి కావాలి !

ఉనికి

ఎక్కడున్న దెక్కడున్నది ?
— ఈ జగతిని
ఎక్కడున్న దెక్కడున్నది ?

నాలుకపై అమృతమే
నాట్యమాడు చున్నది !
నయనద్వయ మందాలకు
అరువి చాపు చున్నది —

మాటలలో అమృతమే
మంచి చూపు చున్నది !
చర్మముపై స్పర్శ సుఖం
చెరలాడుచు ఉన్నది —

మదిలోపల కామాదులు
కదను తొక్కు చున్నవి !
మతిలోపల అజ్ఞానం
మరులు కొలుపు చున్నవి !

పంచేంద్రియముల నన్నిటి
పాంప మంటి యున్నది !
పుణ్యము నీ పాదములకు
పూజ చేయు చున్నది !

ఏ వనము లోనుండి ఇచ్చోటి కొచ్చావు ?
ఏలనో మరచావు చిలుకా !
ఏనాటి కైన ఆ వనము నీదని ఎరిగి
ఎగిరి పోవేలనే ? చిలుకా !

అస్థికల ఇంటిపై తోలు కప్పును వేసి
హాయిగా కులికేవు చిలుకా !
అనుకొనని సుడిగాలి రెచ్చి వచ్చును రేపు —
ఆ ఇల్లు కూలునే చిలుకా !

కామాదు లను వారు కఠినాత్ము లున్నారు
కట్టేరు నిను సుమీ చిలుకా !
కాలాన కనుమూసి వెనుకటిసే వంకె
కలకాల మటు లౌను చిలుకా !

నా వారు నా దనుచు మమత జిక్కే వంకె
నాచు వలె చుట్టేరు చిలుకా !
నాకు నీవే యనుచు నారాయణాద్రీశు
నట్టె గట్టిగ పిలువు చిలుకా !

## జాలరి

చాలా చాలా చేపలు పట్టే మల్లేలో మల్లేలో
సంగుకి ఇచ్చి వండన్నాను మల్లేలో మల్లేలో

రొయ్యలు చూసి మీసం మెలేశ మల్లేలో మల్లేలో
బొయ్యిలో పెట్టి కాల్చన్నాను మల్లేలో మల్లేలో

పెద్దల కెట్టే రోజొస్తుందని మల్లేలో మల్లేలో
పెద్దవి తీసి పండెట్టన్నా మల్లేలో మల్లేలో

ఉప్పు కారం ఊరెయ్యన్నా మల్లేలో మల్లేలో
ఉన్న వాటిలో కొన్నిటి నన్నా మల్లేలో మల్లేలో

గిడసలు తీసి వేరుంచాను మల్లేలో మల్లేలో
వడిగా మసాల వేసొండన్నా మల్లేలో మల్లేలో

మూతి మూసుకొని చేపలు పట్టే మల్లేలో మల్లేలో
రాతిరి దాకా పొణా లొడ్డా మల్లేలో మల్లేలో

అన్ని వదలి కొండకెళ్ళినా మల్లేలో మల్లేలో
అన్నిటి కన్నా వెంకడె మిన్ననీ మల్లేలో మల్లేలో

సత్తెగొడులు

వూర్ప్

ఏడు కొండ లెక్కేను చందమామ
ఎంత అలసి పోయాను చందమామ

పుష్కరిణిని చూసేను చందమామ
పుణ్యానే పూచె నమ్మ చందమామ

గోపురమును చూసేమ చందమామ
గొప్పగ బంగార మమ్మ చందమామ

వేంకటేశునే చూశా చందమామ
వెలిగిపోతున్నాడు చందమామ

కిరీటమును చూసేను చందమామ
కోర్కె లన్ని కూలిపోయె చందమామ

తిరునామము చూసేను చందమామ
తరించింది నాజన్మిక చందమామ

పూలమాల చూసేను చందమామ
చాల వమ్మ కళ్ళు రెండు చందమామ

మంగమ్మను చూసేను చందమామ
మహాలక్ష్మికే దండము చందమామ

వడ్డికాసులను చూశా చందమామ
పండెను నా నోములే చందమామ

కాళ్ళు రెండు చూసేను చందమామ
కదల లేదు నా కాళ్ళు చందమామ

నా నమ్మిక నను కొన్నా చందమామ
నే నమ్మిన దేవుడమ్మ చందమామ

# ఉద్బోధ

శివకేశవులకు భేదము లేదని అల్లో నేరేడల్లో
సిరితో వెలసెను వేంకట రమణే అల్లో నేరేడల్లో

కొండలు పైపై కెక్కుతు ఉంటే అల్లో నేరేడల్లో
కోటి జన్మముల పాపం పోవును అల్లో నేరేడల్లో

వేంకటాద్రిపై వెలిగే దేవుడు అల్లో నేరేడల్లో
వేయి దీపములై సరి కావతనికి అల్లో నేరేడల్లో

శంఖు చక్రములు, ఎదపై నతులతో అల్లో నేరేడల్లో
శతకందర్పుల సుందరు డాతడు అల్లో నేరేడల్లో

వేయి కళ్ళకే విందనిపించును అల్లో నేరేడల్లో
వేయి కరములతో మ్రొక్కగ తోచును అల్లో నేరేడల్లో

## సూక్తి

అప్పు లుండే వారి వెనుకను వెళ్ళ కన్నది లోకము !
అప్పు కాదా జన్మ జన్మలు అయ్యో ! నీ కన్ని ?

తెప్ప లేకనె నీటి లోనికి వెళ్ళ కన్నది లోకము !
తెప్ప లేటికి కాచి బ్రోచే వరద ! నీ వుండ ?

నిప్పు లుండే కాపు లోనికి వెళ్ళ కన్నది లోకము !
నిప్పు కంటెను కాల్చి వేయద పాప కృత్యము జన్మనే ?

ఉప్పు లేకనె గంజి కయ్యును లేదు రుచి యని లోకము
ఉప్పు కంటెను రుచికి మిన్నగు తృప్తియే కద? ఓ ప్రభూ!

తుప్పు పట్టును ఇనుము పూతలు లేక నన్నది లోకము !
తుప్పు పట్టద మనసుకే కామాదు లన్నవి అంటితే ?

# దర్పణము

వెన్నెలంటె సొంపు కదా వెన్నెలాలో
వేంకటేశు డింకెంతో వెన్నెలాలో

పండ్లంటే తీపి కదా వెన్నెలాలో
పండ్లకంటె తీపి తండ్రి వెన్నెలాలో

పూలంటే మోజు కదా వెన్నెలాలో
పూల కన్న సుకుమారుడు వెన్నెలాలో

గాలి సోకితే హాయిలు వెన్నెలాలో
సోలి పోదు మతని దాక వెన్నెలాలో

వానంటే పులకింతుము వెన్నెలాలో
వాని దయం సోన మిన్న వెన్నెలాలో

పరమాన్నము తీపి కదా వెన్నెలాలో
పరమార్థం అతి మధురం వెన్నెలాలో

పాలంటే తెలుపు కదా వెన్నెలాలో
పరమాత్ముడు దర్పణమే వెన్నెలాలో

# సర్వాంతర్యామి

ఉదయాద్రి వెలుగులే
ఏదో భాషను తెల్పు
　　　　ముద మిచ్చునది నీవు ఉయ్యాల

సూర్య చంద్రుల కాంతి
సూటిగా చెప్పునయ
　　　　ముద మిచ్చునది నీవు ఉయ్యాల

సంద్రమే కెరటాల
సడిలోన సూచించు
　　　　ముద మిచ్చునది నీవు ఉయ్యాల

వేదాలు నాదాల
వేనోళ్ళ తెల్పురా
　　　　ముద మిచ్చునది నీవు ఉయ్యాల

ఉపనిషత్తులు బుక్కు
లే పల్కు వేదియో
　　　　ముద మిచ్చునది నీవు ఉయ్యాల

ఆకాశమున చుక్క
లన్ని మినుకున తెల్పు
ముద మిచ్చునది నీవు ఉయ్యాల

నెలయేరు సాగుచూ
గలగలల చెప్పురా
ముద మిచ్చునది నీవు ఉయ్యాల

పూలన్ని మంచులో
పులకింపుతో పల్క
ముద మిచ్చునది నీవు ఉయ్యాల

ఎలతేటి ఝుంకార
ముల సూచనలు చేయు
ముద మిచ్చునది నీవు ఉయ్యాల

అంతలో నవిపించు
నుంత నా మదిలోన
ముద మిచ్చునది నీవు ఉయ్యాల

# నాడు - నేడు

కొండపల్లి వెళ్ళేను కొయ్యబొమ్మ కొన్నాను !
కోరి మురిసిపోతి నాడు కొండదేవరా —
నువు చేసిన బొమ్మ ననే నుడి ఎరిగితి నేడు —

గద్వాల వెళ్లేను గళ్లకోక కొన్నాను !
గంగి కట్టుకొనగ నాడు గంతు వేస్తిరా
పాపపుణ్యముల వైనం బ్రతు కంటా నేడు —

వాహనాలు ఎక్కేను వడివడిగా సాగేను
వహ్వా యని మనసు నాడు తంతపాడెరా —
కాలం నాకొర కుందని కనుగొంటిని నేడు —

పనులన్నీ ఆపి వేసి పగలు పండుకొంటి నాడు —
వేకువ మెలకువ కొరకని వెలుగు పనులకే,
మనుగడ నిను చేరుట కని నే నెరిగితి నేడు —



సప్త గిరుల

## అశక్తుడు

నింగి దాక నిచ్చెనతే
నిలుపలేనురా !
కొండచేరి చరణాలే
కొలువలేనురా !

మమత పెరిగి పోయెరా !
మనసు మరగి పోయెరా !
మాట అంద లేనుర్రా ?
మాయ తోచె నంతరా !
మనసు లేని
మనుషులలో
మసలు టెటులనో ?
మసలు టెటులనో ?

ఎటు చూచిన ఆహాం తలచి
ఏవో దుర్మార్గాలు !
కామ క్రోధ లోభాదులు
కదను త్రొక్కు వేదికలు !
మమత సమత మృగ్యమైన
మసలు టెటులనో ?
మసలు టెటులనో ?

# తీరని కోరిక

పూవుగ నీకడ నుందా మంటే
పూవుగ నను పూయించే దేది ?

కర్పూర హారతి నౌదా మంటే
కప్పురముగ నను మార్చే దేది ?

మణిగా మకుటము నుందా మంటే
మత్తనువున అస్తిక లేనా ?

హరిచందనముగ చేరుద మంటే
అహో మాంసపు ముద్దగ చేసేవ్ !

హారముగా నిన్నలరుద మంటే
అయ్యో ! ప్రేవులు నాలో పేర్చేవ్ !

ఏ మయ్యా ! నా బ్రతు కింతేనా ?
పలమ పలుకవు నా రమణా !

# భ్రమ

కలో నిజమో తెలియలేనురా —
నీ రూపం
కనులు విప్పి చూడలేనురా !

ఆపాదమస్తకము
అంతా బంగారమే
రత్నాల మూర్తి !
రమణా ! తేజస్వీ !
ఇహం అహం తొలగి పోవురా — నా మనసే
పరం కోరి పరుగు తీయురా !

మానవుడను శక్తి లేదు !
మహాప్రభో మాటరాదు !
మ్రోడుగ నీ పద సన్నిధి మోకరిల్లితి !
మోయుచుంటి నా నోటను నీ నామమే !

వైరిగ నీ చేత జచ్చి
పరమ పదము నొందలేను !
భక్తునిగా సన్నుతించు
బహు జన్మల నెత్తనా ?
మౌనమేల పెదవి కదుపవా ? కమలాక్షా !
మదిలోపల వెలుగు నీయవా ?

## ఎదురుచూపు

ఎండైన వానైన ఎదురె చూస్తాను !
ఏనాటికైనను నిన్నె నమ్మేను !

కాయైన పండైన కరవైనను
ఆకైన అలమైన తేకున్నను
దుంపైన ధూళైన దూరమైన
నీరైన నారైన నిరసించిన —

వెలుగైన ఇరులైన వెను తీయను !
విషమైన మధువైన వేరెంచను !
కుక్కైన నక్కైన లెక్కేలరా ?
నీడైన నీవైన నీ లీలరా !

అడియాసలై ఆశ లడుగంటినా
బ్రతుకంత భారముగ భుజమెక్కినా
గుడిలేని ప్రతిమలా పడి యుంటిరా !
మనసారలో నిన్నె స్మరియింతురా !

# భయమేల ?

నా కేల భయ మౌను ?
నారాయణాద్రీశ !
నీ వీ ధరణిలోన
నిలచుండి నను బ్రోవ —

మండుటెండలు నన్ను
మాడ్చి వేయగ లేవు.
కర కైన చలి ఒళ్ళు
కొరకి వేయగ లేదు.
అశనిపాతము నన్ను
అణగార్చ లేదుర !
ఝంఝూనిలము లెన్నొ
జడిపింపనే లేవు —

నీ ఆజ్ఞ లేనిదే
నీ డైన కదలునా ?
సప్తార్ణవము లందు
సలిలమ్ము నిలచునా ?
కరి లేచి కదలునా ?
గిరి కూలి నిలచునా ?
బ్రతు కంత నా కిలను
భద్రమ్ముగా సాగు —

# నిరసన ఏల ?

శర నన్న వారిని
కరుణించ లేవా ?
ఇటు లేం పిలచిన పలుచనరా ?
ఇ కెంత కాలము పరిశీలన ?

అవతారమూర్తిగ నమ్మేనురా !
అయ్యా నీ కీ బ్రతుకు నమ్మేనురా !
రాజీవలోచన !
రతిరాజ సుందర !
రా రా ! వరాకా !
రక్షింపరా !

ఆశాసుమాలే వాడేనురా !
అంతా చీకటి ! నీవె విద్యుల్లత !
నా పూజ లన్ని
నట్టేటి పాలా ?
నా కింక నీ దారి
నారాయణా !

# తెరలేల ?

తెర లేల నో వరద !
తెర లేలరా ?
తెర తీసి నా కనుల
తెరిపింపరా !

పాపాత్ముడను నేను
వరము కోరితి నోయి !
కనులార నిను చూచి
కను మూయ నీరా !

కమలాలు నీ చరణ
కమలాల నిలువ —
అభయమ్ము నీ పాణి
నలరింప నరయంగ —

అపుడపుడె కను తెరచు
అపురూప కుసుమాలు
మాలలై ఎద నూగి
మై మరచు ఈ వేళ —

## ఊపనా ?

ఊపనా ? ఉయ్యాల లూపనా ?
ఊపనా ? ఉయ్యాల లూపనా ?
నిన్నుంచి మదిలోన ఊగింతురా !
నీ రీతి నే గూడ నూగేనురా !

బంగారు ఉయ్యాల తేలేనురా !
బంతిపూవుల దిండ్లు తేలేనురా !
కొ్రొత్త విరి పాన్పు నాకడ లేదురా !
పీతాంబరము లే పరువలేనురా !

నివదింప లేనురా బాణాలను
వినిపింప లేను నీ గీతాలను
పదిమందినీ పిలచు శక్తేదిరా ?
పరితపించే యెదను శమియింపనీ —

ఆదిశేషుడు నిన్నె అలరించుచూ
పది రెట్లు మెత్తగా పాన్పైవనూ,
శ్రీదేవి సిరులతో పల్లన్నను
భూదేవి విరులతో దరి చేంవా —

# సమస్య

ఇదో అదో తెలియదు
ఈ సమస్య తీరదు —
ఈశా ! జగదీశా !
ఏమనందువో — నే
నేమి చేతురా ?

ఇటు రక్తి ! అటు ముక్తి ! —
ఇటు శక్తి ! అటు భక్తి ! —
ఇదా ? అదా ? అదా ? ఇదా ?
ఏమనందువో ? నే నేమి చేతురా ?

ఇటు జాతి ! అటు నీతి ! —
ఇటు మోసం ! అటు ధర్మం ! —
ఇదా ? అదా ? అదా ? ఇదా !
ఏమనందువో ? నే నేమి చేతురా ?

అయినవార లంద రిటు —
అటు పొమ్మను మనసే —
ఇదా ? అదా ? అదా ? ఇదా ?
ఏమనందువో ? నే నేమి చేతురా !

# పదధూళి

పదధూళులేరా శ్రీగంధము!
పదయుగళమే నా కైవల్యము!

కోపాలు తాపాలు నాకొద్దురా!
కోరేది వేరేది తేలేనురా!
వేషాలు మోసాలు నాకొద్దురా!
పాపాలు లోపాలు నాకొద్దురా!

భవనాలు తురగాలు నాకేలరా?
లలితదుకూలములు నాకేలరా!
మణులు మాణిక్యాలు నాకేలరా!
నౌకర్లు చాకర్లు నాకేలరా?

బాలాజి నీ దయతో తరియించెలా!
ఏలోయి ఆవరము నాకీయవు?
అందుకో — దీపాన్ని లో చేర్చుకో!
అందాక నా బ్రతుకు పాలించుకో!

# ఏమి చేయను

అలిగేవనా ?
అలసేవనా ?
ఏ మందురా ? — స్వామి !
ఏం చేతురా !

అరచేత పాదాల నే నొత్తనా ?
అలమేలుమంగనే బ్రతిమాలనా ?
పన్నీటి స్నానాలు చేయించనా ?
ఫలరాజములు తెచ్చి తినిపించనా ?

చిరు చమటలే ఒత్తి సేవించనా ?
ఊయలల నిన్నూపి నే పాడనా ?
ముంజేత వింజామరలు వీచనా ?
మురిపించు ముంగురులె సవరించనా ?

పతకాలు హారాలు సరిచేయనా ?
పరమాన్నమే తెచ్చి ముందుంచనా ?
విరిమాలలే కట్టి నీ కీయనా ?
హరిచందనము తీసి నే పూయనా ?

# కల

కల గంటిరా ! ప్రభూ !
కల గంటిరా !
కలలోన నిన్నే
కనుగొంటిరా !

బంగారు పాదాల తళతళ లవే !
వడ్డికాసుల పేర్ల వరవ ళ్ళవే !
పరవళ్ళు తొక్కింది నా మానసం !
పరవశముతో తూలె నాహో ! అదే !

కర్పూర హారాలు కనుపించెరా !
కనకాభిషేకాలుగా తోచెరా !
ఆ పాణిలో అభయ మరసేనురా !
హేమాద్రిపై నిలచి నట్లాయెరా !

అలమేలు నాంచారి అగుపించెరా !
అయ్యమ్మలే నన్ను దీవించెరా !
నామమ్ము మకుటమ్ము కనుపించెరా
నాలోన దీపా లెవో వెల్గెరా !

# కిం కర్తవ్యం ?

చేసేది ఏ ముంది
కేపాచ లేశా !
చేయూత నీరా !
సేవింప నీరా !

ఘోరంగ మాత్సర్యమే పెరిగెరా !
ఘోర పాపా లెన్నొ చేయించెరా !
మోహాలు మోసుతే వేసేనురా !
మోగ్రిడుగా నా బ్రతుకు చేసేనురా !

క్రోధాలు లోభాలు రగిలేనురా !
భేదాలు ద్వేషాలు జ్వలియించెరా !
మన సంత మరుభూమిగా చేసెరా !
మన్నించి దరి చేర్చి కాపాడరా !

పరువమ్ము గరువమ్ము న న్నూపెరా !
పంతాలతో మదిని పగిలించెరా !
పదిమందిలో నేను పడతేనురా !
పదిలంగ ఎడదీసి పాలించరా !

# త్యజనం

నా కొద్దు ఓ రమణ !
నా కొద్దురా !
దయచూపి దరిజేర్చి
దర్శింపనీ —

సంఘాలు సమరాలు నా కొద్దురా !
హంగామ గరువమ్ము నా కొద్దురా !
ఏకాకిగా నిన్ను సేవింపనీ !
దయచూపి దరిజేర్చి దర్శింపనీ !

వేషాలు మోసాలు నా కొద్దురా !
రోషాలు దేశాలు నా కొద్దురా !
నీ సేవలో బ్రతుకు దిగజారనీ !
దయచూపి దరిజేర్చి దర్శింపనీ !

పంతాలు పట్టింపు నా కొద్దురా !
పగవారు నా వారు నా కొద్దురా !
నా అండ నీ వుండు — నమ్మేనురా !
దయచూపి దరిజేర్చి దర్శింపనీ !

# ప్రాధేయత

తెర తీసి త్యాగయ్య
నరయ లేదా ?
అరి కంట నైన నను
అరయ వేల ?

సందర్శనము బాపు
సకల పాపపు జ్వాల
సంకీర్తనమె తెచ్చు
స్వర్లోక సౌఖ్యాలు —

నీ వుండు ఆ కొండ
నిరతమ్ము నా అండ
"గోవింద" యే గీత
గోవిందమేరా —

చిరునగవు నీ మోము
చెదర దీ యెదలోన —
కడచేన నా బ్రతుకు
కడకు నీ స్మరణలో ? —

# అభ్యర్థన

బండరాతి బ్రతుకునే కదలించవా ?
కొండపైన నీ కొలువున చేర్చుకోవా ?

వేదనలో —
వేకువలో —
వేసవిలో
వేడెండల —
బలికోరే
చలిలోపల —
కలకాలం
కలవరింతు —
కనుపించవా /
కరుణించవా !
కసి బూన కో ప్రభు !
కాపాడరా !

నీ శాసన మ్మేదో
నే చేసినది ఏదో —
నీ వేమి కోరితివో
నే నే మిచ్చితినో —

ఎరుగ నోయి — బ్రతుకే
విరిగె నోయి !
కరుగ దాయె ! మనసు
మార దాయె !

జ న్మిచ్చిన దీ వనుచూ
జనియించితి నే ననుచూ —
బ్రతు కంతా నీ దానిన
నౌతా — సేవిస్తా నని
నమ్మేనురా ! అది
వమ్మైందువా ?
నీ సొమ్మునే ప్రభు !
నీ వుంచుకో !

## మొర

నిన్నే నమ్మితిరా ! బ్రోతువని
నీ కమ్మితి రమణా !

దాటించి నాతిగ మార్చితి వంట !
నాతికి శాపమె తీర్చితి వంట !
కుడిచితి వట ఆ శబరి ఫలమ్ములు
గుహుని నావలో పోయా వంట !
అల్పుగ నెంచకు
ఆలసింపకుర
ఆలంబన మిక నీవే ! దేవా !

వాలి సోదరుని కాచితి వంట !
వానరములనే బ్రోచితి వంట !
జటాయువుకి ఆ విభీషణునికి
చిట్టి ఉడుతకును వర మొసగే వా ?
కలలోనైన
మెలకువనైన
తలతును బ్రోవర దేవా ! కావా !

# సుడిగాలి

రేగింది సుడిగాలి రేగిం దయా !
రేగి నా ఎడదనే లాగిందయా !

కల్లోల మయినాయి
స్వర్లోక స్వప్నాలు !
పురికొంపలా కూలె
పున్నెంపు పంటలే—
చేయెత్తి నేనుంటి ననజాలవా ?
చేయెత్తు నా ఆశలే లేపవా ?

నవ వధువులా ఉన్న
ఆశాసుమాలు
నలిగి నేలకు ఒరిగి
బలి చేసె బ్రతుకులు !
చేయెత్తి నేనుంటి ననజాలవా ?
చేసులా నా ఆశ పండించవా ?

జలతారు చీరలా
జవరాలి మేనిలా
మురిపించె నన్నెదో
ముందున్న భవనం !
చేయూత నందాక నీ వీయవా ?
చేయెత్తి నిన్నెగా పిలచే నయా !

# తెరచాప

తెరచాప లేచిందిరా — నీ
తెరచాప లేచిందిరా !
తెరు వేదో చూపిందిరా !
బరు వంత తొలగిందిరా !

చీకట్ల పొర లెన్నో చివురించినా
చీకాకు లే వైన తేలేవురా !
తరగలే తల లెత్తు లేచేనురా !
తడబడదు నా పడవ నడి జలధిలో !

వెన్నెల్ల తళతళలె ఊరించినా
ఆ న్నలలు మిలమిలల కవ్వించినా
మీనాల కలకలలు కనుపించినా
ఏనాడు నా కింక భయ మేదిరా ?

గగనాన జలదాలు జడిపించినా !
గాలైన వానైన నా కేమిరా ?
గడు సైన పిడుగులే పడ నున్ననూ !
కడదాక తెరచాప నా కౌనురా !

# నా చదువు

నా చదు వింతేరా ! దేవా !
నా చదు వింతేరా !
నిను తెలియుటకే చదువులుగా !
నిను కలియుటకే చదువులుగా !

శిలగా నీ వై నిలచినను
పలుకక ఉలుకక పడి యున్నా
నీకై వెదకుచె నా చదువు !
నిన్ను తలంచుచె నా చదువు !

కొండల కోనల కొలు వున్నా
బండల మాటున దాగున్నా —
నీకై వెదకుచె నా చదువు !
నిన్ను తలంచుచె నా చదువు !

వింగిని తేలుచు నీ వున్నా
నిరాకారుడై నీ వున్నా —
నీకై వెదకుచె నా చదువు !
నిన్ను తలంచుచె నా చదువు !

## నెయ్యము

అయ్యా ! నీ నెయ్యమే
ఆశించివారా !
అలసింపక గోడు
ఆలింప రారా !
అన్నియూ నీవె యని నమ్మెనురా !
అభయమ్ము నిత్తు వని నిలచేనురా !

ఆరోగ్యమున కనుచు
ఆశతీర్చుట కనుచు
అన్యాయ మెగసినా
ఆపదలు ముసరినా —
అన్నిటికి నిన్నె నే పిలచేనురా !
అలాగు నిన్నె నే కొలచేనురా !

దానములలో విద్య
దాన మిచ్చుట గొప్ప —
అనుకొనే యుగ మింక
అరిగి పోయెనురా !
అదె నీవు నా కిచ్చు శిక్షాయెరా !
అంత నీ లీల నీవే రక్షరా !

చెలిమి లే కున్ననూ,
బలిమి లే కున్ననూ,
ఫలము లే కున్న — నీ
కలిమి లే కున్ననూ,
కలియుగపు హోమాగ్ని దహాయించినా,
కాలమే గడపుచూ ఉన్నానురా !

# హృదయం

ప్రేమపూరితం నీ హృదయం !
పేదకాదు — మృదు మధురం !

రక్ష నీవె యని వేడగనే
రమణి ద్రౌపదిని కాచేవు !
దిక్కు నీవె యన గజరాజు
రక్షించితి వో స్వామీ —

వేళ నిన్ను గన ముదుసలిది
కాచితి వెంగిలి ఫలము తిని —
బ్రోవగ రమ్మన బాలకుడా
ధ్రువుని గగనమున నిలిపితివే —

విభీషణుని దయ గొనలేదా ?
వీపున గిరి దాల్చితి వోయి !
ఎల్లర గాచితి వచలము నెత్తి !
కల్ల చేయకుము నా ఆశ —

## మరచుటెట్లు ?

ఎటుల మరతును వేంకటేశా !
ఎన్నడైనను వీడ తేరా !

సుతులు తల్లిని మరువ గలరా
జన్మ నిచ్చిన దాతగా ?
పాలు పోయుచు మమత పెంచే
పరమ పావని మాతగా ?

కొలనులో కద కలువ పెరుగును
కొండపై నది నిలచునా ?
వనధి వైపుగ నదులు సాగును
వనములో నవి ఇంకునా ?

వెంట నిలచే నీడ తొలగున
వీసమైనను దూరమై ?
శ్రీనివాసా ! చిద్విలాసా !
జన్మ జన్మల కారణా !

## దేహి

దేహి యంటినిరా దొరా !
పొ మ్మనకుముర దేవరా !
బలము గలిగిన రేడు నీవె !
ధరము కాచే ప్రాపు నీవె !

వల్లె యని నా కభయ మిచ్చిన
ఎల్లయును సాధింప గలనోయ్ !
వల్లకా దన ఎవరు దిక్కగు ?
వల్లకా డగు నాదు సర్వం !

జననమరణాల్ నీదు మాయలు !
అది అంతము నీదు లీలలు !
చంచలత్వము తొలగ నీయర !
చంపు చపలత్వమ్ము నాలో !

ఆత్మజ్ఞానము తేజరిల్లని !
ఆర్పు మజ్ఞాన మను దీపము !
అమృత భాండముగా నిలువరా !
ఆంతరంగపు విషపు కీలల !

# నిదురలో ఆశ

నిదురింపనా ? స్వామి !
నిదురింపనా ?
నిదురించి కలలందు
నిను చూడనా ?

కోర్కె లెన్నో మదిని
కోరి నిదురించెరా !
నిదురలో నవి యన్ని
నిదుర చాలించు నని —

తీరకున్నది మనసు —
తీరు లేకనే నిలచె —
తీరునా మన సనుచు
తరియింతు నే ననుచు

ఆకాశ హార్మ్యాలు
అన్ని నేలకు దించి
అందులో న న్నుంచి
హాయి నేలుదు నంచు —

## వేణుగానం

ఇం పౌను నీ వేణుగానం !
ఇం కేది నే కోర నోయి !

శతకోటి గోపికల
శరదిందు మోహన !
శయ్యగా నా యెదను
సంసిద్ధ పరచితిని !

సుముఖుడవు ! సులభుడవు !
సుఖదుడవు ! సుహృదయ !
సుందరుడ వోయి ! నీ
సందర్శనము పరము !

కలలందు పాలించు
కల్యాణధామ ! నా
దోషాల తిమిరాలు
తోలి వెలుగర రమణ !

# నిక్కపు దైవము

వేంకటేశుడు కాక
వేరొక్క దైవమ్ము
ధరలోన లేదందురా !
నే నెప్పుడును నిన్నె
మనసార స్మరియింతు
మర చేలరా ? దేవతా !

నీ పాద సీమయే
నిత్య సురపుర మగును
దీవించి నను కావరా !
నట్టడవిలో నేను
నడచిపోతున్నాను
నీవెగా నా దీపము !

కోరికలు తీర్చేటి
కొండదొర నీ వంటి
కని పెంచకుం బోవరా !
వేడుకున్నా మంటె
వెన్న కద నీ మనను
పసివానిలా చూడరా !

## భూపాలి

నా పాలి భూపాలగా తేచిరా !
నాలోని చీకటులలో వెలగరా !
నా మనసు సిందగ
నా బ్రతుకు పండగ
నా కింక అందగ
నా పూల చెందుగ —

రాధ సేలిన నిన్ను కననీయరా !
వ్యధ తేలు నా కథలె మరపింపరా !
నీ కంటి కాంతులను మురిసేన్నురా !
నీ కరములను సోక వెన్నొదురా !

తనువు నా గుండెనే బంధించెరా !
కనులందు ఒత్తులే కొడి కట్టెరా !
పిలచి నా గొంతుకే చీలేనురా !
తలచి నా మన సంత మరగేనురా !

వాలు తగిలిన నీరు పారేనురా !
గాలి వీచిన విరులు ఆడేనురా !
వేడి తగిలిన మంచు కరగేనురా !
వెన్నెలా బ్రతు కంత నిను చూడగా !

## రిక లేదా ?

తీరిక లేదా ? స్వామి !
తీరిక లేదా ?
నా సొద విన వేలోయి !
నా వ్యధ కనవా ?

వేలుపులు నీకై పాడిన
మేల్కొలుపులలో —
గోవిందా యను స్తుతిలో
గోడే వినవా ?

కోనేటివి హాయిగా
స్నానాల్ చేయ
మంగమ్మను కలసి నీవు
మరచేవా నన్ను ?

పన్నగమ్ముల రేడునూ
పగవాడును చేసే
పెద్ద సేవలందు మొరలు
పెడచెవి బెట్టేవ ?

# మనుజ జన్మ

జన్మించుటే అసలు
చాల పాపం బయ్యా
జన్మ లన్నిట మనుజ
జన్మ మేలటగా —
జననాథ ! నీ వేమి తలచేవురా ?
పని బూని ఎపు డైన చెప్పేవురా ?

చచ్చి పుట్టుట కన్న క్రిమి కీటకాదులుగ
జంతువుగ పుట్టుటే మే లౌనుగా ?
జంతువై చచ్చేక ఏనాటి కో నాడు
జన్మింతురి నరులుగా నిజమా ?

క్రిమి కీటకాదులుగ జీవించు టెన్నాళ్ళు ?
గిట్టి పుట్టంగానె గిట్టిపోవు నట !
జంతువై కొన్నేళ్ళు జీవించినను కూడ
జంతువుల నిను దాచ గలవా ?

నరరూపులో నన్ను చేసి పడవేసేవు
నాయనా ! నిన్నె గా సేవించితి !
పాలింప కున్న నను కరుణతోడను దేవ !
పశువుగానే ఉంచరాదా ?

# బా గుం డు ను

బాగుండును కద అలా గైతే
బ్రతుకే సార్థక మౌను సుమీ !
పలు జన్మల నెత్తక నీలోనె
కలసెద నో వృషభాద్రీశ !

రఘురాముడిగా అడవుల నడువగ
        రాముని పాదుక లయ్యానా ?
రావణు దునించగ వారధి గట్టే
        రాలను నే నొక టయ్యానా ?

గోపాలకుడవు నీవై యుండగ
        గోవులలో నొక టయ్యానా ?
గోవర్ధనగిరి నెత్తిన వేళను
        గోపాలకునిగ నున్నానా ?

వేణువు పూనిన కరకంకణముల
        మణిగా నేనై యున్నానా ?
వెలివడు గానములో రాగమునై
        గాలులలో నహా ఊగేనా ?

బుద్ధునిగా నీ బోధన చేయగ
పాడి మాటలలో ఉన్నానా ?
బోధిమహిజచ్ఛాయల నుండగ
భూజపు ఆకై ఉన్నానా ?

కత్తిపట్టి కలి రూపుడవైతే
కత్తికి ఒర నేనయ్యానా ?
కదను తొక్కుచూ ముందుకు సాగే
అశ్వమ్ముగా నే నున్నానా ?

వేంకటేశ ! నువు వెలసిన చోటను
పారిజాతమ్ముగా నయ్యానా ?
వేంకట గిరిపై సోపానాలను
వేయి రాళ నొకటయ్యానా ?

# దారి ఏది ?

ఏమి చేతును నేను
ఏడు కొండల వాడ !
ఏదారియును కాన కున్నారా !
అందుకే నిన్నడుగు చున్నారా !

తపము చేదా మంటె,
తాపసుల వలె నన్ను
నిల్పెదవు చుక్కగా గగనమ్ములో !

దానాలు చేతునా —
దాత బలి వలె నన్ను
పాతాళమున గదా పడద్రొక్కుదువు !

ఇంద్రలోకము కొరకు
ఎందుకా యజ్ఞాలు ?
ఇంద్రుడే నీ క్రింది వాడాయెగా !

కలసి నీలో నేను
కలకాల ముండుటకు
కలియుగేశా మార్గ మేదోయి ?

## చిరు కోరిక

వల దయ్యా ! వల దయ్యా !
వరద ! దొడ్డ పను లేవియు —
"ఓ" యంటే చాలు నోయి !
ఒకటే చిరు కోరి కుంది —

సోమకు ద్రుంచుట కా దది
సుదతిని కాచుట కా దది
తలచిన సుళు వగు నీ కది
తపనము బాపును నా కది —

మాయ నటించుట కాదది
మారుట మోహినిగ కాదు
నరునిగ పుట్టుట కా దది
నరకుని చంపుట కా దది —

తప్పులు మా రగు వరకును
తల దించుట కా దోయది !
రావణు ద్రుంచుట కా దది !
రాజుల జంపుట కా దది !

శివధను వెత్తిన రీతిని
సీతను చేపట్టు రీతి
మురళిని మ్రోయించి నటుల
ముద్దుగ కైవల్య మీర !

## తీరని కోరిక

గోవర్ధనముగ పుట్టించి
గోటి కొనను నన్నుంచేవా !
గోపికగా నను పుట్టించి
గోపాలునిగా ఏలేవా ?
వెదురు పొదలలో పుట్టించి
వేణువుగా నన్నూదేవా ?
బాలునిగా నను పుట్టించి
లీలల నాతో ఆడేవా ?
కస్తురిగా నను పుట్టించి
కరుణతో తిలకము దిద్దేవా ?
ముత్తెముగా నను పుట్టించి
ముక్కున ముచ్చట గుంచేవా ?
శిఖిగా నన్నే పుట్టించి
శిరమున కన్నులు దాల్చేవా ?
కనకముగా నను పుట్టించి
కంకణముగ ధరియించేవా ?
అమృతముగా నను పుట్టించి
అమరులందరికి పంచేవా ?
వానరునిగ నను పుట్టించి
వారధి గట్టగ వాడేవా ?

వనమున తరువుగ పుట్టించి
వాడితివా నను పాదుకగా ?
లోహముగా నను పుట్టించి
అహా ! నీ తూపున ఉంచేవా ?
తాటాకుగ నను పుట్టించి
తలపై ఛత్రము పట్టేవా ?
అడవుల ఫలముగ పుట్టించి
అయ్యో ! ఆకలి గొన్నావా ?
పట్టుగ చెట్టున పుట్టించి
పుట్టముగా నను కట్టేవా ?
మణిగా నన్నే పుట్టించి
మకుటములో ధరియించేవా ?
చందన వృక్షముగా చేసి
చందనముగ నను పొందేవా !
పాప కూపముల నను తోసి
పొడియ విడచుట ? ఓ రమణా !
వరులను బ్రోచే దేవుడవే
నా మొరలే విని కావగదే !

## దాసరి

ఏదీ నా కిక మధుమాసం ?
లేదా రాదా మృదుహాసం ?

గుండెలు పగిలే రోదవ లేనా ?
బండలు పేలితే బాధే నా ?
అండలు నీ వని నమ్మితిరా — నీ
కొండల కోనకు చేరితిరా !

మోనము వల దని కోరితిరా !
రోసము చూపకు మోహితా !
దాసరి నైతిని నీ దయకై !
వేసము కాదుర నీ మోలీ !

మారెను బ్రతుకే ప్రేతవనం !
ఆరెను మనసున ఆశా దీపం !
కోరితి రమణా ! నీ సాయం !
తీరిక లేదా కలకాలం ?

## అక్కర

ఎక్కడ సురపుర
మెక్కడ కలదో —
అక్కర తీర్పగ రావయ్యా !

వేదవాదమే విను చతువులకు
వేరే నా సొదలే పడవా ?
వెన్ను నెఱుగుటకు వేదపఠన మన
వేరే దిక్కెవ రో స్వామీ ?

గానము నీపై చేతామంటే
ఆ నారదుడను కాలేనే —
వీణావాదన చేతా మంటే
వాణి వీణ నా కడ లేదే —

నాట్యముతో మురిపిద్దా మన నే
నమర కాంతగా కాలేనే —
సామజవరగమనుడ వట దేవా !
సరసకు చేరుచుకో లేవా ?

# పరాకా ?

శరణన్న చాలట
కరుణింతు వని వింటి
ఇటువైపు చూడంటి స్వామి !
అటువైపు చూ వేల నోయి !

వేరొక్క ప్రహ్లాదుడే వేడెనా ?
మరియొక్క ధ్రువుడెటనో మరగే ననా ?
ఎటనైన కరిరాజు రోదించెనా ?
ఏమూలనో శిలయె నిన్దించెనా ?

అలమేలు మంగమ్మ వలదన్నదా ?
ఆదిశేషుడె నీకు అను వయ్యెనా ?
ఆకాశరా జింటి కేగే వనా ?
ఆర్తనాదము నీవు వినలే దనా !

ఏ సభనో స్త్రీ నీవు దిక్కనియెనా ?
ఏ వృద్ధనారియో తపియించెనా ?
ఏ అంబరీషుడో పూజించెనా ?
ఈ దీను బ్రోవగ కినుకాయెనా ?

# వేడుకోలు

వేడెద నో దేవ ! నిను
వేడెద నోయి !
దనుజవైరి ! దేవరా !
మనుజుడ నను కావరా !

తహతహతో నా హృదయం
తల్లడిల్లెరా స్వామీ !
అపరాధిని మన్నింపుము
అభయ మిచ్చి బ్రోవరా !

కోర్కెమించి ఒసగునట్టి
గొప్ప దైవ మందురే
పర దేవత ! వరదాతా !
ప్రభు ! తరింప నీయరా !

శరణాగతవత్సలా !
సకల దేవగణములకును
శిరోభూషణా ! ఓ
సారనిధీ ! విజయాభవ !

## శరణం

శరణం ప్రపద్యే
శరణం ప్రపద్యే
శరణం తవ చరణం !
శరణం తవ చరణం !
శుభగుణలోలా !
శ్రితమందారా !
శ్రీమంతా ! ఓ దయామయా !

అనూపురార్చిత సుజాతి సుమముల
ఆరాధించే సుగంధ శోభల
ఆచరణాలే నా కామితములు !
ఆశ్రితములు ! నా మందారములు !

చూడ చూడగా చూడగ తోచును
ఊడే వరకును ఊపిరులు —
ఇంపు సొంపుతో తీరుగ తోచే
ఈశా ! నీ చరణయుగళినే —

సౌందర్యరాగ సౌరభాశ్రయమ్ములు !
సద్యోవికసిత సరసీరుహములు !
సువర్ణభూషిత శిరీషమ్ములు !
సురపూజిత మృదు చరణాలే !

## ఆశ్రయము

ఆశ్రియ మిక నా
కా పదయుగళము !
అలంబన మవె
ఆరాధ్యమ్ములు !

అమృత కలశం,
అంకుశము —
శంకచక్రములు,
శ్వేతచ్ఛత్రము,
వజ్ర కల్పములు
ధ్వజ మందే కల —

పద్మరాగములు పదము ల క్రింద !
పైభాగమ్మున ఇంద్రనీలములు !
నఖాలలో ఆ శశాంక భాసత !
నఖాలకే అవి అనంత శిఖరం !

కరపల్లవముల, ప్రేమ ప్రీతితో,
కమల ఒత్తగా వాడిపోవునే —
మనోజ్ఞమ్ములగు ఆ చరణాలే
మరచుట మరణాంతర మేగా ?

సదాశ్రియం !
పదాంబుజం !
మదంతరం !
సుధార్ణవం !

శ్రీదేవియు, భూదేవియు,
నీలా దేవియు కలసి
నీ పాదా లొత్తగా —
కందిన నీ పాదాలను
కందురు ఏవో రంగులు —

పరమేశుడు విరించాది
సుర ప్రముఖుల రతనమ్ముల
కిరీటాల తళతళలో
కర్పూర హారతి వెలుగుల
అంద మొంది
అలరారును !

సారధిగా పార్థున కే
చరణాలను చూపితివో —
ఆ పదము లె నాకొర కిల
చూపితి వని నమ్మితి నే —

# అనల శరము

తవ చరణం నా కాశ్రియం !
భవబంధాలకు అనలశరం !

కాళీయునిపై నటించు చరణం !
కానన మందున కదలే చరణం !
వేద శిరస్సుల వెలిగే చరణా !
వేంకటాద్రిపై వెలసిన చరణం !

విరికన్నియలకు అంతిపురం !
గిరి శిఖరానికి ఆభరణం !
భక్తజనుల కానందదాయకం !
భగవంతుం డగు స్వామి పదం !

శరణాగతులకు ముందు గోచరం !
సర్వజనుల కది అమృతమయం !
సాటిలేని దా పదయుగళం !
సాగిల దోచే వాంఛ కారణం !

## పద యుగళి

పదాలు నమ్మితి పావనా !
పదాలు పాడితి పావనా !

జగాన వేరొక ముక్తి సాధకం !
యుగాల కైవను రాదది సత్యం !
అనాథజీవుల కదే ఆశ్రయం !
అమర లోకమున కది సోపానం !

పదాంబుజములను సదా సుధలవే
చిత్తము క్రోలుచూ మత్తిల గోయను —
ఎడారి లోపల గుడార ముండదు
పరాశ్రయాలకు పరుగిడదే యెద !

నిరాకరించదు నీటనీ క్షీరం ! —
పరాకు చేయని పదాలు నీ వట !
చకోర మెరుగును చంద్రుని వైపుగ —
చరణములే కద తరుణోపాయం !

# న మ స్సు లు

నమస్సు లమ్మా !
నమస్సు లమ్మా
మంగా మాయమ్మ !
— కా
వంగా రావమ్మా !

పాణిపల్లవము తాల్చెను పద్మం !
పాద పద్మముల నిలచెను పద్మం !
నాథుని ఎదపై నలరిన పద్మం !
నా తల్లీ ఇదె ఎద అను పద్మం !

క్షమాగుణమె నీ సొ మ్మౌ నంట !
చరాచరమ్ములు నీ సుతులంట !
వాత్సల్యానికి నీ వి ల్లంట !
వరాలతల్లికి సా టెవ రంట !

భవ బంధాలకు వందనం !
బంగరు తల్లీ వందనం !
నీ వల్లభునకు వందనం !
మీ కావే నా వందనం !

# నివేదన

నివేదనలనే కొనవయ్యా !
నీ ప్రసాదముల నీవయ్యా !
కొందుము మా నయనాల కద్దుకొని
కొందు మోయి ! మా ప్రాణపదముగా

పళ్ళెరముల నవె లడ్లు జిలాబిలు !
పసిడి గిన్నెలను పలు పాయసములు !
కొనవయ్యా !
తిన వయ్యా !

చక్కెర పొంగలి కేసరిబాత్ !
చక్కెర ముక్కలు చిక్కని పాలవె !
కొనవయ్యా !
తినవయ్యా !

వేడి వేడి దధ్యోదన మదిగో !
వడలు నేతిలో వేచిన వవిగో !
కొనవయ్యా !
తినవయ్యా !

# మంగళము

మంగళం ! మంగళం !
మంగళం ! మంగళం !
శ్రీనివాస ! మంగళం !
శ్రీగిరీశ ! మంగళం !

మనుజలోక రక్షకా ! మంగళం ! మంగళం !
దనుజ జాతి శిక్షకా ! మంగళం ! మంగళం !

సర్వావయవ సుందరా ! మంగళం ! మంగళం !
సదా సమ్మోహితా ! మంగళం ! మంగళం !

ఓ నిత్యా ! నిరవద్యా ! మంగళం ! మంగళం !
ఓ సచ్చిదానందా ! మంగళం ! మంగళం !

సర్వశక్తి సంపన్నా ! మంగళం ! మంగళం !
సర్వశేషపూర్ణకామ ! మంగళం ! మంగళం !

గిరివాసా ! కలియుగేశ ! మంగళం ! మంగళం !
గరుడాసన ! కరిరక్షక ! మంగళం ! మంగళం !

# శుభము

శుభం! శుభం! ఇదె
శుభం! శుభం!

పావన గిరులకు శుభం! శుభం!
ప్రాకారములకు శుభం! శుభం!

పుష్కరిణికి ఇదె శుభం! శుభం!
పుణ్యజలములకు శుభం! శుభం!

గుడి దీపములకు శుభం! శుభం!
గుడి గంటలకే శుభం! శుభం!

దేవళమునకును శుభం! శుభం!
దేవదేవునికి శుభం! శుభం!

అర్చనల కిదే శుభం! శుభం!
అభిషేకములకు శుభం! శుభం!

ప్రవిమలమూర్తికి శుభం! శుభం!
ప్రభావ! నీ కిదె శుభం! శుభం!

హారతి కాంతికి శుభం ! శుభం !
వరాల మోముకి శుభం ! శుభం !

తీర్థపాత్రలకు శుభం ! శుభం !
తీర్థమ్మున కిదె శుభం ! శుభం !

వడ్డికాసులకు శుభం ! శుభం !
వరునలతీరుకి శుభం ! శుభం !

భక్తవత్సలా శుభం ! శుభం !
భక్తికోటి కిదె శుభం ! శుభం !

